










నేను వారందరినీ
నా ఎక్కో స్కెచ్
పెన్‌తో చిత్రించాను.

**EKCO**

స్కెచ్ పెన్‌తో

రంగులు, పిల్లలు వాటిని ఇష్టపడుతారు, వారు
డ్రాయింగు ఇష్టపడుతారు. మీపిల్లలలో
నిగూఢమైన ప్రతిభని వెలుపలికి తెండి.
అతనికి/ఆమెకి ఆకర్షనీయమైన ఎక్కో
స్కెచ్ పెన్‌ల సంచీని బహూకరించండి.
వవి ఆకర్షనీయమైన రంగులలో
వస్తున్నాయి.




డిస్ట్రిబ్యూటర్లు : కిరన్ & కం.
73/75 స్యామ్యూల్ స్ట్రీట్, బొంబాయి 400 002.
ఫోను : 324432

ఎక్కో స్కెచ్ పెన్‌లతో వ్రాయుటం
ఆనందదాయకం.

కత్తిరించి ఉంచండి



# బోర్న్‌విటా

# ఆశ్చర్యకరమైన పరిశోధన పుట-4

## రికార్డు ప్లేయరు యొక్క అద్భుతం

కనిపెట్టినవారు : థామస్ ఆల్వా ఎడిసన్
1847–1831 యు ఎస్ ఎ

సూత్రం : ధ్వని తరంగాలు రికార్డుపైన రికార్డింగ్ చేయబడగల స్పందనలను కలిగిస్తాయి : తదుపరి, అసలు శబ్దం రికార్డు ప్లేయరుపైన రికార్డును వేయుట ద్వారా పునరుత్పత్తి చేయబడగలదు.

సంవత్సరం : 1877 (మూలమైన దానిని వాక్స్ సిలెండరుపైన రికార్డుచేసి హారన్ ద్వారా ప్రసరింపజేయుట.)

**రికార్డు ప్లేయరు ఏవిధంగా పని చేస్తుంది ?**

రికార్డు చేసేందుకు ధ్వని మైక్రో ఫోన్ ద్వారా విద్యుత్ ప్రేరణలుగా మార్చబడి తదుపరి రికార్డు యొక్క ఉపరితలముపై సన్నని వర్తులాకారపు గీతల రూపంలోకి రికార్డు చేయబడుతుంది. గీతల లోతు అసలు ధ్వనియొక్క రికార్డు చేయుట కోసం స్పందనల తీవ్రత తారతమ్యాలను బట్టి మారుతుంది.

రికార్డునుంచి ధ్వనిని తిరిగి ఉత్పత్తి చేయుపట్టి రికార్డు ప్లేయరులో రెండుభాగములు కలవు. 1. టరంటేబుల్. 2. టోన్-ఆరమ్.

టరం టేబుల్ దానిపై వుంచబడిన రికార్డును ఒకే వేగంతో త్రిప్పుతుంది. నిముషానికి నిర్ణీతమైన పరిభ్రమణ సంఖ్య (33 1/3, 45 లేక 78 ఆర్ పి యమ్)










టోన్-ఆరమ్

ఒక వైపు అమర్చబడి మరియొకవైపు స్వేచ్ఛగా కదులునట్లుండి రికార్డు వేయబడినప్పుడు దానిపై నిలుచుటకు ఒక సూదిని కలిగియుంటుంది. రికార్డు తిరిగినపుడు సూది గీతలోనికి జారబడి విభిన్నమైన గీతల లోతులలో సూది కదిలి స్పందన పొందుతుంది. సూదియొక్క స్పందనలు టోన్-ఆరమ్ ద్వారా విద్యుత్ ప్రేరణలుగా మార్చబడి తదుపరి యాంప్లిపై చేయబడి అసలు శబ్దము పునరుత్పత్తి చేయుటకు స్పీకరుకు ప్రసరణ చేయబడుతుంది.






**క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా**

మీకు అగ్రస్థానం చేకూర్చి అధిక శక్తినిస్తుంది.

ప్రత్యేక సదుపాయం - 4



ఒక ప్రముఖ డిస్ట్రిబ్యూటర్‌తో మేము ప్రత్యేకమైన ఏర్పాటుచేసి, ఆకర్షణీయమైన 48 పేజీల రంగుల సచిత్ర పుస్తకం. "The How and Why Wonder Book of Robots and Electronic Brains" (ఇంగ్లీషులో) యు. కె. లో ప్రింటు చేసినది. సరసమైన ధరలో రూ. 4.50 కే (మూల్యధర : 35 పెన్స్) లభిస్తుంది. పోస్టు ఛార్జీ లేకుండా, మీ పుస్తకం కొరకు రు. 4.50 మనియార్డరు ద్వారా పంపండి. మరి ఒక బోర్న్‌విటా ప్యాక్‌పై పలుచని కాయితంగాని లేదా పై అట్టగాని ఏదైనా విడిగా పోస్టులో పంపండి : Department : 5C India Book House, 22 Bhulabhai Desai Road, BOMBAY 400026 త్వర పడండి ! పుస్తకాలు పరిమితం.

కత్తిరించి ఉంచండి

కత్తిరించి ఉంచండి

# అమృతాంజన్
## లిమిటెడ్‌వారి
## విశిష్టమైన
# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు
సైజులలో
లభిస్తుంది:
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము

OBM 3270/3 TG RR

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

రానున్న 1979 బాల సంవత్సరంగా ప్రపంచమంతటా అమలు జరుగుతుంది. భారతదేశంలోని 30 కోట్ల బాలల తరపున "చందమామ" బాల సంవత్సరానికి స్వాగతం చెబుతున్నది. ఆ సంవత్సరం అంతా చందమామ "పురాణ బాలల" కథలు నెలనెలా ప్రచురిస్తుంది.

## అమరవాణి

కిం తయా క్రియతే ధేన్వా
యా న సూతే, న దుగ్ధదా ?
కోర్థం పుత్రేణ జాతేన
యో న విద్వా న్నభక్తిమాన్ ?

[ఆవు గొడ్డుమోతు అయి, పాలు ఇయ్యనిదైతే ఏం లాభం? విద్యావినయాలు లేని కొడుకు దేనికి?]

సంపుటి 63 డిసెంబర్ '78 సంచిక 6

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






**సుధాకర్ 'బంధు', అజ్మీర్, (రాజస్థాన్)**

ప్ర: ఈ వైజ్ఞానిక యుగంలో, చందమామ వాస్తవికత తెలుసుకున్న తర్వాత, దాని ప్రభావం ''చందమామ'' మీద ఎంతవరకు పడిందో తెల్పగలరా?

**జ:** ఖగోళజ్ఞానం పుట్టిన నాటినుంచి అసలు చందమామ గురించి అందరికీ తెలుసు. అయినా పురాణాలలో చంద్రుడు మనిషిగా చలామణీ అవుతూనే వస్తున్నాడు. మన "చందమామ" అన్నది పేరు, సంకేతం మాత్రమే. "సుధాకర్" అన్నది చందమామ పేరే. కాని మీకూ, చందమామ వాస్తవికతకూ ఏమిటి సంబంధం?

**కె. జి. సరళకుమారి, కె. జి. హేమలత, కుప్పం (ఆంధ్ర)**

ప్ర: చందమామ కంటె నక్షత్రం ఎన్నిరెట్లు పెద్దది? చంద్రమండలానికీ, నక్షత్రమండలానికీ దూరం ఎంత?

**జ:** ఎవరో కావాలని ఏర్పాటు చేసినట్టుగా భూమి మీద మనకు సూర్యుడూ (నక్షత్రం), చంద్రుడూ అచ్చు ఒకే ప్రమాణంలో కనిపిస్తారు. కాని వాస్తవానికి సూర్యుడు చంద్రుడి కన్న 300 పై చిల్లర రెట్లున్నాడు. అంటే సూర్యుడనే నక్షత్ర ప్రమాణంతో పోల్చితే చంద్రుడి ప్రమాణం 90 వేలలో ఒక వంతు! మరి సూర్యుడి కన్న పదివేల రెట్లూ, లక్షల రెట్లూ ఉన్న నక్షత్రాలు ఆకాశంలో ఉన్నాయిట.

చంద్రుడు మనకు సుమారు 240 వేల మైళ్ళ దూరంలో ఉన్నాడు. కొందరు శాస్త్రవేత్తలు చంద్రుణ్ణి భూమికి ఉపగ్రహంగా కాక, భూమినీ చంద్రుణ్ణీ సూర్యుడి జంటగ్రహాలుగా భావిస్తారు. అందుచేత భూమిదీ, చంద్రుడిదీ ఒకే మండలం అనుకోవచ్చు. నక్షత్ర మండలం అంటూ ఎక్కడో లేదు. నక్షత్రాలు చాలా ఎడం ఎడంగా ఉంటాయి. సూర్యుడు మనకు సన్నిహిత నక్షత్రం. భూమీ, చంద్రుడూ, సూర్యుడి వాతావరణంలోనే ఉన్నాయి. సూర్యుడి తరవాత మనకు దగ్గిరగా ఉన్న నక్షత్రం 26 లక్షల కోట్ల మైళ్ళ దూరాన—సూర్యుడున్న దానికి 28 లక్షల రెట్లు దూరంలో ఉన్నది. నక్షత్ర మండలం సర్వ వ్యాప్తం అనాలి.




## 66

రాజు అడిగిన దానికి కుమ్మరి, "మహారాజా, నన్ను యుధిష్ఠిరుడు అంటారు. నేను కుమ్మరి కులానికి చెందిన వాణ్ణి. ఈ గాయం కత్తి దెబ్బవల్ల కలిగినది కాదు. ఒకసారి నేను తప్పతాగి, పదునైన, గట్టికుండ పెంకు మీద పడ్డాను. ఈ మచ్చ ఆ గాయం బాపతే," అన్నాడు.

"అయ్యో, ఎంత అవివేకిని! వీడి యోధుడి వాలకమూ, భయంకరమైన గాయంమచ్చా చూసి మోసపోయాను!" అనుకుని రాజు వాణ్ణి వెళ్ళగొట్టించాడు.

అప్పుడు కుమ్మరి, "మహారాజా, నన్ను వెళ్ళగొట్టకండి. యుద్ధంలో నా ధైర్యమూ, చాకచక్యమూ పరీక్షించండి," అన్నాడు.

"నువు ఎంత శక్తిమంతుడివైనప్పటికీ నిన్ను వెళ్ళగొట్టక తప్పదు. వెనకటికి కథలో అన్నట్టుగా, 'నువు ధైర్యంగల వాడివీ, అన్ని శాస్త్రాలూ పడచదివిన వాడివీ, అందగాడివీ అయినప్పటికీ, ఓ బిడ్డా, మీ వంశంలో పుట్టినవాడు ఏనుగును చంపలేదు.'' అన్నాడు రాజు.

"తమరు చెప్పే కథ ఏమిటి?" అని కుమ్మరి అడగగా రాజు, అతడికి ఇలా చెప్పాడు:

### సింహ పెంచిన నక్కకథ

ఒక అరణ్యంలో ఆడసింహమూ, మగసింహమూ ఉండేవి. ఆడసింహం అప్పుడే రెండు పిల్లలను ఈనింది. మగసింహం రోజూ ఏదో జంతువును వేటాడి తెచ్చి, ఆడసింహానికి ఆహారంగా ఇచ్చేది.

ఒక రోజు మగసింహం చీకటిపడిన దాకా అడవి అంతా తిరిగినప్పటికీ, ఒక్క



జంతువు కూడా దొరకలేదు. అది తన గుహకు తిరిగి వస్తూండగా దానికి ఒక నక్కపిల్ల దారిలో కనిపించింది. అది కూన కావటంచేత సింహం జాలిపడి, దాన్ని చంపక, నోట కరచుకునిపోయి, ఆడసింహానికి ఇచ్చింది.

"నాకు ఆకలిగా వుంది. తినటానికి ఏమన్నా తెచ్చావా, ప్రియా?" అని ఆడసింహం అడిగింది.

"ప్రియురాలా, నాకీ నక్కపిల్ల తప్ప ఇవాళ ఏమీ దొరకలేదు. ఇది కూడా మనలాగా గోళ్ళు కలిగిన మాంసాహారే. పైపెచ్చుకూన. అందుకని నేను దీన్ని చంపలేదు. ఆకలితో చచ్చిపోతున్నప్పుడు కూడా స్త్రీని, లింగధారిని, బ్రాహ్మణ్ణీ, పిల్లలనూ, ముఖ్యంగా తనను ఆశ్రయించిన వారినీ చంపరాదంటారు. అయితే ఇప్పుడు నువు జబ్బుమనిషివి, ఆరోగ్యకారణాలచేత ఆహారం తీసుకోవలసిన దానివి కనక, దీన్ని చంపి తిను. రేపు ఇంత కంటే మంచి జంతువును తెస్తాను," అన్నది సింహం.

"ప్రియా, కూన అని నువే చంపనప్పుడు, ఆడదాన్నీ, మాతృమూర్తినీ అయి ఉండి, నా పొట్టనింపుకోవటానికి దీన్ని ఎలా చంపను? అవసానదశలో కూడా నిషిద్ధమైన పని చేయరాదనీ, కర్తవ్యం మానరాదనీ ధర్మశాస్త్రాలు చెబుతాయి గద. అందుచేత నేను ఈ నక్కపిల్లను నా మూడో కొడుకుగా చూసుకుంటాను," అని ఆడసింహం నక్కపిల్లకు తన చనుబాలు ఇచ్చింది.

బలకరమైన సింహం పాలు తాగి నక్కపిల్ల పెరిగి చాలా పెద్దదిగానూ, బలం కలదిగానూ తయారయింది. సింహం పిల్లలూ, నక్కపిల్లా తమ మధ్య గల జాతిభేదం తెలుసుకోకుండా, మూడూ అన్నదమ్ములలాగా పెరిగి, కలిసి ఆడుకుంటూ వచ్చాయి.

ఒకరోజు అవి మూడూ అరణ్యంలో సంచరిస్తూ ఉండగా వాటికి ఒక అడవి

ఏనుగు తటస్థపడింది. దాన్ని చూస్తూనే సింహం పిల్లలు రోషంతో దాని మీదికి లఘించాయి. అప్పుడు నక్క వాటితో, "దాని జోలికి పోకండి. అది మీకు జాతి శత్రువు." అని చెప్పి, అతి వేగంగా సింహం ఉండే నివాసం కేసి పారి పోయింది.

సింహం పిల్లలు కూడా తమ అన్న వైఖరి మూలాన ఉత్సాహం చెడి, ఏనుగును వదిలేశాయి. శక్తివంతుడైన నాయకుడు తన ధైర్యంతో ఒక సేనను ఉత్తేజపరచగలడు; కాని వాడు పిరికి వాడై, పారిపోతే, సేన అంతా ధైర్యం కోల్పోయి, క్షణాలమీద పలాయనం చేస్తుంది!

సింహం పిల్లలు రెండూ ఇంటికి వెళ్ళి, తమ తల్లిదండ్రులతో తమ అన్న పిరికితనమూ, అది ఏనుగును చూసి, భయంకొద్దీ పారిపోవటమూ నవ్వుతూ చెప్పాయి.

నక్క ఇందుకు మండిపడింది. దాని కళ్ళు ఎరుపెక్కాయి, పెదవులు వణికాయి. అది తన తమ్ముళ్ళ మీద దారుణమైన తిట్లు విసరింది.

దాని ప్రవర్తనకు సింహం పిల్లలలో ఆగ్రహం పెరగసాగింది. అది చూసి తల్లి సింహం, తాను పాలిచ్చి పెంచిన నక్కను కాపాడటం కోసం, "నాయనా, వాళ్ళను అలా అనరాదు. వాళ్ళు నీ తమ్ముళ్ళు గదా!" అన్నది.



ఈ మృదువైన మాటలకు నక్క నూరింతలు రెచ్చిపోయి, "వీళ్ళకు నేను ధైర్యంలోగాని, విజ్ఞానంలోగాని, రూపు రేఖలలోగాని, ఎందులో తక్కువని నన్ను వెటకారం చేస్తున్నారు? నేను నా ఆత్మ గౌరవం నిలుపుకునేటందుకు వీళ్ళని చంపితీరాలి," అన్నది.

ఆడసింహం నవ్వు ఆపుకుంటూ, "నాయనా, నువు ధైర్యం గలవాడివి కావచ్చు, చదువుకున్నవాడివి కావచ్చు, అందగాడివి కావచ్చు. కాని నీ వంశంలో పుట్టిన వారెవరూ ఏనుగును చంపలేరు. అందుచేత, నా మాట శ్రద్ధగా విను. నువు పుట్టుకచేత నక్కవు. నిన్ను చూసి జాలిపడి, నీకు నా పాలిచ్చి పెంచాను. నా పిల్లలు ఇంకా పసివాళ్లు కావటంచేత నువు నక్కవని ఇంకా గ్రహించలేదు. అందుచేత వెంటనే వెళ్ళిపోయి, నక్కలతో చేరు. లేకపోతే, నా కూనల వల్ల నీకు ప్రాణాపాయం ఉన్నది," అన్నది.

ఈ మాట విని నక్క, ప్రాణభయంతో కంపించిపోతూ, పారిపోయి ఇతర నక్కల మధ్య చేరిపోయింది.

రాజు ఈ కథ చెప్పి, కుమ్మరితో, "నువు కుమ్మరివి మాత్రమేనని నా సైనికులింకా తెలుసుకోకముందే వెళ్ళిపో. లేకపోతే, నిన్ను వాళ్ళు హాస్యం పట్టించి చంపుతారు," అన్నాడు.

కుమ్మరి వెంటనే బయలుదేరి వెళ్ళిపోయాడు.

కోతి ఈ కథ చెప్పి, "మూర్ఖుడా, నీ భార్య కోసం నువు మిత్రద్రోహం తలపెట్టి, ఆమె ప్రేమనూ, కృతజ్ఞతనూ సంపాదించుదామనుకున్నావు. కాని కథలో బ్రాహ్మణుడి భార్య, ఒక కుంటి వెధవ కోసం తనవారినందరినీ వదులుకుని, తన అర్ధాయుస్సు ధారపోసిన భర్తను చంపటానికి సిద్ధపడిన విధంగా ఆమె ప్రవర్తించి ఉండేది," అన్నది.

"ఏమిటా కథ?" అని మొసలి అడిగిన మీదట కోతి ఇలా చెప్పసాగింది:





# భల్లూక మాంత్రికుడు

## 6

[చంద్రశిలానగరం మీద దాడికి బయలుదేరిన రాజు దుర్ముఖుడి పైకి, భల్లూక మాంత్రికుడు, తలారి భల్లూకాన్ని ఉసికొల్పాడు. అది చూసి దుర్ముఖుడు ఒక అంగ రక్షకుడితో పాటు గుర్రం మీద, అరణ్యానికి అడ్డంపడి పారిపోతూండగా, నాగమల్లు అనే దొంగలనాయకుడు అతణ్ణి తాడుఉచ్చుతో బిగించి, కొమ్మల పైకి లాగాడు. తరవాత—]

ఇద్దరు దొంగలు భీకరంగా అరుస్తూ, చెట్ల కొమ్మల్లోంచి, తన గుర్రం ముందుకు దూకగానే, రాజు దుర్ముఖుడి అంగ రక్షకుడు, గుర్రం కళ్ళెపుతాళ్ళను గట్టిగా లాగుతూ, "అయ్యలారా, నా నడుం నుంచి కత్తి వేళ్ళాడుతున్నా. నేను నిరాయుధుడి కిందనే లెక్క! నా నుంచి మీ కెలాంటి హానీ కలగదు," అన్నాడు భయంతో వణికిపోతూ.

దొంగల నాయకుడు నాగమల్లు, ఎడం చేత్తో గుర్రం కళ్ళాలు పడిసి పట్టుకుని, కుడిచేతిలో వున్న కత్తిని అంగరక్షకుడి కంఠం కేసి చాచి, "ఒరే, నువు నిజంగా కత్తిదూసినా, మేం భయపడే వాళ్ళం కాదు. అదుగో, నీ ముందుపోయిన గుర్రం వాడు, చెట్టుకొమ్మ నుంచి వేళ్లాడు తున్నాడు. మీవాళ్ళు మరికొందరు యిటు కేసి వస్తున్నారా?" అని అడిగాడు.



తమ అనుచరులు మరి కొందరు వస్తున్నారంటే, ప్రమాదం తప్పుతుందో, లేక యిటు వచ్చిన వాళ్ళం, తామిద్దరమే అంటే ప్రమాదం తప్పుతుందో అని ఆలోచిస్తూ, అంగరక్షకుడు జవాబిచ్చేందుకు తటపటాయిస్తున్నంతలో, రాజు దుర్ముఖుడు కొమ్మ నుంచి తాడుకు వేళ్ళాడుతూనే, "ఈ అవమానాన్ని నేను సహించను; ఎక్కడరా, అంగరక్షకా!" అంటూ కేకపెట్టాడు.

అంగరక్షకుడు జవాబివ్వబోయేంతలో నాగమల్లు కత్తి ఝళిపించి బెదిరిస్తూ, "నువు అంగరక్షకుడివా? ఏ రకంవాడికి, అంగరక్షకుడివి? ముందు గుర్రం దిగు," అని, అంగరక్షకుడు గుర్రం దిగగానే, రాజు దుర్ముఖుణ్ణి కొమ్మల్లోకి లాగేందుకు నానా అవస్థాపడుతున్న దొంగతో, "ఒరే, మనకు బాగా డబ్బున్న జీవాలే దొరికినట్టున్నవి. ఆ పట్టు ఉడుపులు కట్టిన వాణ్ణి, నడుం విరక్కుండా జాగ్రత్తగా నేలమీదికి జార్చు." అన్నాడు.

కొమ్మల్లోని దొంగ, దుర్ముఖుణ్ణి మెల్లిగా నేలకు దించాడు. ఆ వెంటనే దుర్ముఖుడు తన నడుముకు బిగిసి వున్న తాడును విప్పబోయేంతలో, నాగమల్లు పక్కన నిలబడి అంతా చూస్తున్న మరొక దొంగ, దుర్ముఖుణ్ణి సమీపించి, "ఆ నడుముకు బిగుసుకున్న తాడును, గొంతుకు బిగించుకోవాలనుకుంటున్నావా ? తొందర పడకు. నువ్వెవరో నిజం చెప్పకపోతే, ఆ పని మేమే చేస్తాం," అన్నాడు.

అంతలో అక్కడికి చెట్టుమీద వున్న దొంగా, నాగమల్లూ వచ్చారు. నాగమల్లు, రాజు దుర్ముఖుణ్ణి నఖశిఖ పర్యంతం ఒకసారి పరీక్షగా చూసి, "నీ విలువైన దుస్తులూ, నగిషీలు చెక్కిన కత్తి ఒరా చూస్తూంటే, బాగా డబ్బున్న వాడివిలాగే కనిపిస్తున్నావు. ముందు నీ దగ్గిర వున్న డబ్బు అక్కడ పెట్టి, తరవాత నువ్వానే, యీ అంగరక్షకుణ్ణి ఇంటికి పంపి, పది వేల వరహాలు తెప్పించు. అలా చేయక

పోయావో నీ ప్రాణాలు దక్కవు. నీ శవం ఆ కనపడే కొండ గుహల్లోవుండే ఏ పులికో, తోడేలుకో ఆహారం అయిపోతుంది,'' అన్నాడు.

ఆ మాటలతో రాజు దుర్ముఖుడు తాను పెద్ద చిక్కుల్లో పడిపోయానని గ్రహించాడు. తాను ఫలానా దేశానికి రాజునని చెపితే, యీ దొంగల నాయకుడు తన తలను అక్కడికక్కడే నరికి, మరింత పెద్ద బహుమతి సంపాయించేందుకు, తన శత్రువైన చంద్రశిలా నగరపు రాజు జితకేతుడి దగ్గిరకు తీసుకుపోవచ్చు. అలా కాక తాను ఏ సంపన్న వర్తకుణ్ణో అని అబద్ధం ఆడితే, అప్పుడు తన అంగ రక్షకుడి చేత పదివేల వరహాలు తెప్పించవలసి వుంటుంది. ఈ లోపల తాను అబద్ధమాడిన సంగతి బయటపడితే....

రాజు దుర్ముఖుడు తన ప్రశ్నకు జవాబివ్వకుండా, మూగిలా యిలా ఆలోచిస్తున్నంతలో దొంగల నాయకుడు నాగమల్లు కసిగా పళ్లు కొరికి, ''ఏమిటాలోచిస్తున్నావు? ఎలాంటి జిత్తులు వేసి, నా నుంచి పారిపోవాలా అని పథకం అల్లుతున్నావా?'' అంటూ కత్తి పైకెత్తాడు.

ఆ వెంటనే దుర్ముఖుడు, ''నువ్వనే ఆ పదివేల వరహాలు ఎలా తెప్పించటమా అని ఆలోచిస్తున్నాను. నా పేరు దుర్జయ



శెట్టి. ఉదయగిరి పట్టణం వాణ్ణి. ఇప్పుడు నా దగ్గిర చిల్లిగవ్వ లేదు,'' అన్నాడు.

ఆ జవాబుకు నాగమల్లు ఆశ్చర్యపోతూ, ''ఇంత విలువైన దుస్తులు ధరించి, అంగరక్షకుణ్ణి కూడా తోడు పెట్టుకుని, అరణ్యంలో చిల్లిగవ్వ చేత లేకుండా ప్రయాణం చేస్తున్నావన్న మాట! ఈ మాటలు నమ్మమనేనా నువ్వనేది?'' అని, పక్కనవున్న దొంగలతో, ''ఒరే, వీడి నడుముకున్న తాడు విప్పి, గొంతుకు బిగించండి. ఉరితీసేందుకు గట్టి చెట్టు కొమ్మ చూస్తాను,'' అన్నాడు.

నాగమల్లు మాట ముగించే లోపలే, ఎక్కడో దూరాన్నుంచి ఏనుగు ఘీంకరించిన



మహారాజా, అని పిలుస్తున్నాడు. అన్నిటి కన్నా వింత, తలారి భల్లూకం....అది అరణ్యంలో దారి తప్పటం!'' అంటూ కత్తిని పైకెత్తి, ''ఒరే, మీ యిద్దరూ నిజంగా మతిమాలిన వెధవలా లేక మాకు, మీ పిచ్చి వాగుడుతో మతులు పోగొట్టాలని చూస్తున్నారా?'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు బెంబేలు పడి పోతూ, ఏం జవాబివ్వటమా అని తికమక పడుతున్నంతలో, యీసారి మరి కాస్త దాపులగా ఏనుగు ఘీంకారం, తలారి ఎలుగుబంటు కేకలూ వినిపించినై. దానితో నాగమల్లు కూడా కొంచెంగా బెదిరి పోయి, ఒక దొంగతో, ''ఒరే, నువు చెట్టెక్కి చూడు! ఒకేసారి ఏనుగు ఘీంకారం, ఎలుగుబంటు గొంతులాంటి మనిషి కేకల్లూ వినబడటం ఏమిటి? వీళ్ళ మాటల్లో ఏమన్నా నిజం వున్న దేమో!'' అన్నాడు.

దొంగల్లో ఒకడు గబగబా పక్కనే వున్న ఒక చెట్టెక్కి, ఆ మరుక్షణం ఒక చావు కేకపెట్టి, ''మల్లూ! ఆ దుర్జయ శెట్టి, వాడి నౌకరూ చెప్పింది నిజం! తెగి వేళ్లాడుతున్న తొండంతో ఏనుగూ, దాని మీద గండ్రగొడ్డలి పట్టుకున్న ఎలుగు బంటూ—అరెరె, దాని గండ్రగొడ్డలి దెబ్బకు, అడ్డం వచ్చిన చెట్లకొమ్మలు

ధ్వనితోపాటు, తలారి ఎలుగుబంటు పెట్టిన గావు కేక కూడా వాళ్లకు వినిపించింది. ఆ మరుక్షణం రాజు దుర్ముఖుడూ, అంగ రక్షకుడూ నిలువెల్లా వణికిపోసాగారు. అంగరక్షకుడు చుట్టూ కలయ చూస్తూ, ''మహారాజా, ఆ తలారి భల్లూకం అర ణ్యంలో ఎక్కడో దారి తప్పిందను కున్నాను. కాని, అది మన జాడలు పసి కట్టి, యిటే వస్తున్నట్టున్నది.'' అన్నాడు.

దొంగల నాయకుడు నాగమల్లు నోరు తెరిచి, గుడ్లు తేలవేసి తన అనుచరులిద్దరి కేసీ అయోమయంగా ఒకసారి చూసి, ''వీళ్ళ మాటలు విన్నారా? వీడు తన పేరు దుర్జయశెట్టి అంటున్నాడు: వాడు

పూచిక పుల్లల్లా విరిగి, చెల్లా చెదురుగా లేచి పోతున్నవి,'' అన్నాడు.

నాగమల్లు భయాశ్చర్యాలతో దిక్కులు చూస్తూ, యిప్పుడేం చేయటమా అని ఆలోచిస్తున్నంతలో, రాజు దుర్ముఖుడు అతడి చేయి పట్టుకుని, ''మల్లూ! మనం త్వరగా యిక్కణ్ణించి పారిపోవటం క్షేమం. డబ్బాశకొద్దీ ప్రాణాలు బలి పెట్టకు. కావాలంటే, నా ఇంటనున్న డబ్బుతో ఒక రాజ్యమే కొనిపెట్టగలను,'' అన్నాడు వణికిపోతూ.



అంగరక్షకుడు గుర్రం ఎక్కి పారిపోవటానికి ఎత్తువేసి, దాని కళ్ళెపు తాళ్ళు పట్టుకుని, నాగమల్లుతో, ''మల్లూ! ఈ క్షణాన నువు, మహారాజుగారి ప్రాణాలు కాపాడావంటే, ఆయన నీకు అర్ధరాజ్యం ధారాదత్తం చేయగలడు! నేను గుర్రం ఎక్కి, వాయువేగంతో రాజధానికి పోయి, సైన్యాన్ని వెంటబెట్టుకు రావటం ఎలా వుంటుంది, మహారాజా?'' అన్నాడు.

''ఆ పని నేనే చేయగలను; కాని రాజధానికి వెళ్ళే మార్గమేదో, యీ మహారణ్యంలో తెలియటం లేదు.'' అంటూ రాజు దుర్ముఖుడు, తానూ గుర్రపు కళ్ళెపు తాళ్ళను వడిసిపట్టుకున్నాడు.

నాగమల్లు తన అనుచరులిద్దరికి సైగ చేసి, దుర్ముఖ, అంగరక్షకుల కేసి కళ్ళెర్ర చేసి చూస్తూ, ''ఒరే, మీ యిద్దరూ నిజంగా బుద్ధిహీనులా లేక ఆరితేరిన మోసగాళ్ళా? అవతల మీరనే తలారి భల్లూకం వచ్చిపడుతూండే, మీరెక్కడో వున్న రాజధానికిపోయి సైనికులను తీసుకువస్తారా?'' అని, అనుచరులతో, ''ఒరే, వీళ్ళనిద్దరినీ తాడుకుకట్టి, ఆ కనబడే కొండగుహల కేసి లాక్కురండి. ఆ తలారి ఎలుగుబంటు, యీ ప్రాంతాలు వదిలిన తరవాత, అసలు నిజంగా వీళ్ళెవరో తెలుసుకుందాం,'' అన్నాడు.

నాగమల్లు యిలా చెప్పి, గుహలకేసి బయలుదేరేసరికి, అతడి అనుచరులు రాజు దుర్ముఖుణ్ణీ, అంగరక్షకుణ్ణీ తాళ్ళతో



కట్టి వెనకగా లాక్కుపోసాగారు. వాళ్ళు ఒక పెద్ద గుహను సమీపిస్తున్నంతలో, తలారి ఎలుగుబంటు చెట్లచాటు నుంచి ఏనుగు నెక్కి అటుకేసివస్తూ, దుర్ముఖుణ్ణి చూసి, "ఒరే, దుష్టుడా, దొరికావా! నిన్నిదే నా గండ్ర గొడ్డలికి బలిచేయ బోతున్నాను," అంటూ ఏనుగు మీదినుంచి దూకి, వాళ్ళవెంటబడింది.

నాగమల్లుతోపాటు అందరూ భయ కంపితులై, పరుగెత్తుతూపోయి ఒక గుహలో జొరబడ్డారు. తలారి ఎలుగు బంటు గుహను సమీపిస్తున్నంతలో, వాళ్లు ఒక పెద్ద బండరాయిని గుహద్వారానికి అడ్డంపెట్టి, లోపల వణికిపోసాగారు.

తలారి ఎలుగుబంటు గుహ ముందుకు పోయి, దానికి అడ్డంగావున్న బండరాయిని ఒకటికి రెండుసార్లు కాలితో గట్టిగా తన్ని, "ఒరే, గుహలో వున్నవాళ్ళంతా బయిటికిరండి. నాకొక్కవలసింది, రాజుదుర్ముఖుడి తల. మిగతావాళ్ళకు ఎలాంటి హానీ చేయను," అంటూ కేకలు పెట్టాడు.

ఆ కేకలు విన్న దొంగలనాయకుడు నాగమల్లు, తన ఇద్దరు అనుచరులతో, "ఇది యింకా బావుంది! ఆ పిశాచి ఎలుగుబంటుకు కావలసింది, రాజుదుర్ముఖుడి తల అట! ఏమిటీ తలా, తోకా లేని గత్తరంతా?" అని రాజు దుర్ముఖుడితో, "ఈ ప్రాంతాలకు సమీపానగల ఉదయ గిరి రాజ్యాన్ని, దుర్ముఖు డనే రాజు పాలిస్తున్నాడు. నేను అరణ్యాలు వదిలి, వింతలు చూసేందుకు నగరాలకు పోయే వాణ్ణికాదు గనక, ఆ రాజును ఏనాడూ చూడలేదు. ఒకవేళ నువ్వే, ఆ దుర్ముఖ రాజువు కాదుగదా?" అని అడిగాడు.

"నేను దుర్జయశెట్టిని, ఉదయగిరి నగరం వాణ్ణి. ఏ పిశాచో ఆవహించిన ఆ ఎలుగుబంటు మాటలు ఎందుకు నమ్ముతావు? మనం క్షేమంగా యిక్క ణ్ణించి బయటపడే మార్గం ఏదైనావుంటే చూడు. నువ్వడిగిన ఆ పదివేల వరహాలూ

యిచ్చుకుంటాను," అన్నాడు రాజు దుర్ము ఖుడు దీనంగా ముఖంపెట్టి.

"మహారాజుగారు, అన్నమాట తప్పట మంటూ ఏనాడూ జరగలేదు, మల్లూ!" అన్నాడు అంగరక్షకుడు.

"ఛీ, వెధవా, నోరుముయ్యి! నిన్నూ, ఏదైనా పిశాచి పట్టలేదుగదా? ఈ అరణ్యం ప్రవేశించినప్పటి నుంచీ చూస్తున్నాను. నన్ను విడవకుండా, అదేపనిగా మహారాజా, మహారాజా అంటున్నావు. బహిరంగ శిరశ్ఛేదం చేయించగలను, జాగ్రత్త!" అన్నాడు దుర్ముఖుడు.



దొంగ నాగమల్లు ఉలిక్కిపడి, మిగతా యిద్దరు దొంగలతో, "ఒరే, మనం అదృష్టంకొద్దో లేక దురదృష్టంకొద్దో, ఉదయగిరి రాజు దుర్ముఖుణ్ణే పట్టి నట్టుంది. రాజుకు తప్ప, మరెవడికి తోటి మనిషిని బహిరంగంగా శిరశ్ఛేదం చేయించే హక్కుంది? ఈ దుర్జయశెట్టి ననేవాడు, నోరుజారి నిజంగా తనెవరైందీ చెప్పేశాడా ఏం!" అన్నాడు.

రాజు దుర్ముఖుడికి బయట గుహకు అడ్డంగా వున్న రాతిని పక్కకు తోసేం దుకు ప్రయత్నిస్తున్న తలారి ఎలుగుబంటి భయంతోపాటు, లోపలవున్న దొంగలు తనకేమైనా హానికలిగించగలరేమో అన్న భయం పట్టుకున్నది. అతడు ఏదో హెచ్చరిస్తున్నట్టు పక్కనవున్న అంగ రక్షకుణ్ణి మోచేతితో ఒకసారి పొడిచి, "మల్లూ! నన్ను గురించి నువ్వేదో భ్రమలకు లోనవుతున్నావు. నేను, నిజంగా, దుర్జయశెట్టినే! ఈ భయంకరా రణ్యం చేరినప్పటినుంచీ, నా నౌకరు మతిస్థిమితం పోగొట్టుకున్నవాడిలా పిచ్చి వాగుడు వాగుతున్నాడు. వీణ్ణీ, ఏదో దుష్ట గ్రహం పట్టివుండాలి!" అన్నాడు.

"క్షమించండి, మహారాజా! అంతే, అంతే," అన్నాడు అంగరక్షకుడు పెద్దగా మూలుగుతూ.

నాగమల్లు తల గట్టిగా పట్టుకుని, "ఇప్పటి పరిస్థితిలో నువు రాజువైనా,

శెట్టివైనా నాకు ఒరగబోయేదేంలేదు. ఆ భయంకరమైన ఎలుగుబంటు గుహ కడ్డంగా వున్నరాతిని పక్కకునెట్టి, గండ్ర గొడ్డలితో మనందరి తలలూ నరకబో తున్నది," అని తన యిద్దరు అనుచరు లతో, "ఒరే, చచ్చేవాళ్ళం, ఎలానూ చస్తాం. మనమే ముందుగా రాతిని పక్కకునెట్టి, కత్తులతోపోయి, ఆ తలారి ఎలుగుబంటు మీదపడటం ఎలావుంటుం దంటారు?" అని అడిగాడు.

దొంగలిద్దరూ తమనాయకుడికి జవా బివ్వబోయేంతలో, అంగరక్షకుడు కల్పించుకుని, "మల్లూ! ఆ తలారి ఎలుగుబంటును, భల్లూకమాంత్రికు డనే వాడు సృష్టించాడు. దాని బలం రాక్షస బలం అనుకో! మనం యీ గుహనే అంటి పెట్టుకుని వుండటం క్షేమం," అన్నాడు.

వాడు మాట ముగించేలోపలే తలారి ఎలుగుబంటు రెండు చేతులతో పట్టి రాతిని కొంచెంగా పక్కకు నెట్టి, గుహ లోపలికి తొంగి చూస్తూ, "ఒరే, దుర్ముఖ రాజా, బయిటికి రా. నీ తల నరికి, నా దారిన నేను వెళ్ళిపోతాను," అన్నది.

"బావుంది! దీని పగ దుర్ముఖరాజో, దుర్జయశెట్టో అనే వీడి ఒక్కడి మీదనే అన్నమాట; వీణ్ణిపట్టి గుహ బయిటికి నెట్టండి!" అన్నాడు నాగమల్లు.

దొంగలిద్దరూ, రాజు దుర్ముఖుడి భుజాలు పట్టుకుని, పెనుగులాడుతున్న అతణ్ణి గుహ బయిటికి యీడ్చబోతు న్నంతలో, గుహకు కొంచెం దూరం నుంచి, "ఇందాకటి నుంచి చూస్తున్నాను, ఏమిట్రా యీ గొడవ? పక్క గుహలో మహా రాక్షసుడైన ఉగ్రదండుడు వున్నాడనే సంగతే ఎరగరా?" అన్న భీకరమైన కంఠస్వరం వినబడింది.

ఆ మరుక్షణం తలారి ఎలుగుబంటు, "నువు, రాక్షసుడివా? ఉగ్రదండుడా, నీ పేరు? భల్లూకమాంత్రికుడి మంత్ర శక్తి గల, యీ గండ్రగొడ్డలి నీ కంఠాన్ని నరకబోతున్నది!" అంటూ, రాక్షసుడి కేసి బయలుదేరింది. —(ఇంకావుంది)






# విషవలయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఈ శవాన్ని ఏమి సాధించటానికి సాధనంగా తీసుకుపోతున్నావో నాకు తెలియదు. కాని సాధనాలు మంచివి కానప్పుడు సాధ్యాలు దెబ్బతింటాయి. ఇందుకు ఉదాహరణగా నీకు ధర్మయ్య కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం ఒక మహానగరంలో గంగయ్య, ధర్మయ్య అని ఇద్దరు గజదొంగలు ఉండేవారు. వారిద్దరూ కలిసి, పెద్దపెద్ద దొంగతనాలూ, దోపిడీలూ చేసి, బాగా డబ్బు సంపాదించేవారు. రంగయ్య తన వంతు ధనాన్ని నిలవజేసుకుంటూ,

## బేతాళ కథలు



గంగయ్యా, ధర్మయ్యా కలిసి చేసే దొంగతనాలు రాజుకు ఒక పెద్ద సమస్యగా పరిణమించాయి. దొంగలను పట్టే ప్రయత్నాలేవీ ఫలించలేదు. అందుచేత రాజు, దొంగల ఆచూకీ తెలిపిన వారికి వెయ్యి బంగారునాణాలు ఇస్తానని చాటింపు వేయించాడు. ఈ చాటింపు వినగానే గంగయ్యకు ఒక ఆలోచన వచ్చింది: తాను రాజువద్దకు వెళ్ళి ధర్మయ్య ఆచూకీ తెలిపితే, తనకు వెయ్యిబంగారునాణాలు లభించటమేగాక, ఇక ముందు తాను చేసే దొంగతనాలలో ధర్మయ్యకు వాటా ఇచ్చే అవసరం ఉండదు.

ఆనందంగా జీవించేవాడు. ధర్మయ్యా అలా కాక తన వాటాకు వచ్చిన డబ్బుతో ఒక ధర్మసత్రం నెలకొల్పి, బీదసాదలకు అన్నంపెట్టేఏర్పాటుచేసి, సాధువువేషంలో పగలంతా సత్రంలోనే ఉండేవాడు.

సాధువు కీర్తి దేశమంతటా వ్యాపించింది. ఈ సంగతి రాజుగారిదాకా వెళ్ళింది. రాజుగారు సాధువును సభకు రప్పించి, అతని దాతృత్వాన్ని ప్రశంసించి, అతనికి "ధర్మదాత" అనే బిరుదు ఇచ్చాడు.

ఈ ధర్మదాత గజదొంగ అన్నసంగతి ఎవరికీ తెలియదు. ఇతనే తన తోడు దొంగ అన్న సంగతి గంగయ్యకూ తెలియదు.

గంగయ్య రాజుగారి వద్దకువెళ్ళి దొంగతనాలు చేసేది ధర్మయ్య అని చెప్పి, అతని ఇంటిజాడ తెల్పాడు. రాజు భటులను పంపి ధర్మయ్యను పట్టి తెప్పించాడు. ధర్మయ్య తాను దొంగతనాలు చేసినది నిజమేనని ఒప్పుకున్నాడు. రాజు అతని విచారణకు ఒకరోజు నిర్ణయించి, అంతదాకా అతన్ని కారాగారంలో ఉంచమని ఆజ్ఞ ఇచ్చాడు.

తరవాత ఒకటి రెండు రోజులకు రాజుకు ఒక సంగతి తెలియవచ్చింది: ధర్మదాత కనిపించటం లేదు: ధర్మసత్రంలో మామూలుగా పేదలకు జరిగే అన్నదానం నిలిచిపోయింది: రాజు

ధర్మసత్రంలో అన్నదానం నిర్విఘ్నంగా జరగటానికి తగిన ఏర్పాటుచేశాడు.

దీని వెనకనే రాజుకు మరో అపజయం ఎదురయింది. ధర్మయ్య కారాగృహంలో ఉన్నప్పటికీ దొంగతనాలు సాగుతూనే ఉన్నాయి. ఈ సంగతి తెలియగానే రాజు తన భటులను పంపి గంగయ్యను తెప్పించి, "ధర్మయ్య విచారణ జరిగే టప్పుడు నీ సాక్ష్యం అవసరం. అంతదాకా నువు ఖైదులో ఉండు. ధర్మయ్య విచారణ పూర్తి అయి, అతనికి శిక్షవేసిన అనంతరం నీకు వెయ్యిబంగారు నాణాలిచ్చి, విడిచిపెట్టేస్తాను," అని చెప్పాడు.

గంగయ్య కొంతవరకు తృప్తిపడి, కారాగృహంలో చేరాడు.

అయితే, ఎన్ని రోజులు గడిచినా ధర్మయ్య విచారణ జరగనే లేదు. ఒక నెల గడిచింది. ఎక్కడా దొంగతనాలు లేవు. ఒక రోజు రాజు ధర్మయ్యను చెర విడిపించి, అతన్ని మంచి జీతం మీద ధర్మసత్రానికి ధర్మకర్తగా ఏర్పాటు చేశాడు.

గంగయ్య ఖైదులోనే ఉండిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రాజు ప్రవర్తనకు అర్థమేమిటి? తానే దొంగనని ఒప్పుకున్న ధర్మయ్యను విచారించకుండా విడుదల చెయ్యటమేగాక, సత్రానికి ధర్మకర్తగా ఎందుకు నియమించాడు? ధర్మయ్యను పట్టి ఇచ్చిన గంగయ్యకు బహుమానం ఇయ్యకపోగా,



విచారణకూడా జరపకుండా యావజ్జీవ నిర్బంధం ఎందుకు కలిగించాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు సూక్ష్మ బుద్ధి గలవాడు. ఆయనకు ధర్మయ్యే దొంగ అన్నవిషయం సందేహం రావలసిన అవసరం లేదు. కాని ఈ ధర్మయ్యే ధర్మదాత అయి ఉండవచ్చునన్న అనుమానం కలగటానికి ఆధారాలున్నాయి. ధర్మయ్యను బంధించగానే ధర్మదాత అదృశ్యమయాడు. అంతేగాక, పెద్ద పెద్ద దొంగతనాలు చేసిన ధర్మయ్య ఇల్లు చాలా సామాన్యంగా ఉన్న సంగతి రాజుకు భటులవల్ల తెలిసి ఉండాలి. ఇక గంగయ్య మాటకు వస్తే, అతను తనకు విరుద్ధంగా చాలా సాక్ష్యం ఇచ్చుకున్నాడు. తను ధర్మయ్య ముఠాలోవాడు కాకపోతే అతనికి ధర్మయ్య దొంగ అన్నసంగతి ఎలా తెలుస్తుంది? అదీగాక గంగయ్య మంచి విలాసజీవితం గడుపుతున్నాడు. అన్నిటినీ మించి అతను చేసినబుద్ధి తక్కువపని, ధర్మయ్య పట్టుబడిన అనంతరం తాను దొంగతనాలు కొనసాగించటం. ఈ విధంగా రాజుకు గంగయ్య పాత్ర పూర్తిగా అర్థమయింది. అతన్ని వేరే విచారించేపని లేక పోయింది. పోతే, ధర్మయ్య దొంగ అన్నమాటేగాని అన్నివిధాలా యోగ్యుడు. తాను దొంగతనంగా సంపాదించినదంతా సత్రం కింద ఖర్చుచేసి, తాను సాధువులాగా జీవించాడు. అతను గంగయ్యపేరు బయటపెట్టలేదు. గంగయ్యలాగా అతను మిత్రద్రోహికాడు. సత్రం నిర్వహణ రాజు వహించే పక్షంలో అతను దొంగతనాలు చెయ్యడు. ఇదంతా ఆలోచించి రాజు ధర్మయ్యను అతనికి తగిన హోదాలో నియమించాడు. రాజు చేసిన నిర్ణయాలు తిరుగులేనివి," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# సత్తు రూపాయి

శెట్టి ధుమధుమ లాడుతున్నాడు. ఎవరో చెల్లని రూపాయి ఇచ్చి బెల్లం తీసుకువెళ్ళారు. పని తొందరలో శెట్టి గమనించలేదు.

ఉన్నట్టుండి శెట్టి ఉలిక్కి పడ్డాడు. దుకాణం ముందు ఎవడో బిచ్చగాడు వంగి ఏదో వస్తువు ఏరి జేబులో వేసుకున్నాడు. ఆ వస్తువు తళతళలాడే రూపాయి బిళ్ల.

"ఆ రూపాయి నాది. ఇలా ఇచ్చెయ్యి." అన్నాడు శెట్టి.

"ధర్మ ప్రభువులు! అబద్ధమాడుతున్నారు!" అన్నాడు బిచ్చగాడు.

శెట్టి వాడితో బేరమాడి, తాను అర్ధరూపాయి ఇస్తే బిచ్చగాడు రూపాయి ఇచ్చేటట్టు రాజీ పడ్డాడు. బిచ్చగాడు అర్ధ రూపాయి తీసుకుని, ఇంకో జేబులో నుంచి రూపాయి తీసి శెట్టికిచ్చి, వెళ్ళిపోయాడు.

ఇంతలో శెట్టి భార్య దుకాణం ముందు ఏదో వెతుకుతున్నది. అబ్బాయి అక్కడ రూపాయి పారేశాట్ట.

శెట్టి గుండె జారిపోయింది. బిచ్చగాడికి అర్ధ రూపాయి ఇచ్చి తన రూపాయే తాను తీసుకున్నాడు. శెట్టి తన చేతిలో ఉన్న రూపాయి చూసుకున్నాడు. అది కూడా సత్తు రూపాయే! తెల్లవారి లేచి, శెట్టి రెండు సత్తు రూపాయిలు సంపాదించాడు.

—ఎమ్. వి. వి. సత్యనారాయణ



# పుట్టుమచ్చ

వీరయ్యా, వీరమ్మా దంపతులు. వాళ్ళకు లేక లేక ఒక కొడుకు పుట్టాడు. వాడి నుదుటి మీద చింతగింజంత పుట్టుమచ్చ ఉన్నది.

భార్యాభర్త లిద్దరికీ పుట్టుమచ్చలు గురించి తెలుసు. "ఒసేవ్! మనవాడికి రాజయోగం ఉన్నది. ఈ పుట్టుమచ్చ చూడు!" అన్నాడు వీరయ్య. అది రాజయోగానికి సంబంధించిన పుట్టుమచ్చ కాదనీ, మహా విద్వాంసుడి లక్షణమనీ వీరమ్మ అన్నది.

ఇద్దరి మధ్యా అభిప్రాయ భేదం దాదాపు కొట్లాటదాకా వెళ్లింది. ఇంతలో బిచ్చగాడొకడు, "అమ్మా, బిచ్చం పెట్టు తల్లీ!" అని ఆర్తనాదం చేశాడు.

భార్యాభర్త లిద్దరూ వాడి కేసి చూసి నిర్ఘాంతపోయారు. వాడి నుదుట చింతగింజంత పుట్టుమచ్చ ఉన్నది!

—రాంబాబు





# రక్షకభటుల సమ్మె

ధర్మం నాలుగు పాదాల నడిచే కోసల రాజ్యంలో హఠాత్తుగా పెద్ద ఎత్తున దొంగతనాలు ప్రారంభమయాయి. దొంగలను అరికట్టడానికి రాజు సైన్యాన్ని ఉపయోగించుదామనుకున్నాడు గాని, ఆ తరుణంలో దేశానికి యుద్ధభయం హెచ్చుగా ఉండడం వల్ల, మంత్రి సలహా మీద ఒక రక్షకభటుల దళాన్ని నెలకొల్పాడు. ఆ రక్షకభటుల పని దొంగలను అన్వేషించడమూ, పట్టుకోవడమూనూ.

రక్షకభటులు రంగంలోకి దిగిన కొద్ది కాలంలోనే దొంగతనాలు తగ్గిపోయాయి. ఒకటి, రెండు సంవత్సరాలపాటు దేశంలో సుఖశాంతులు నెలకొన్నాయి. కాని ఆ తరవాత మళ్ళీ దొంగతనాలు ప్రారంభమయాయి. ఈ సారి రక్షకభటులు దొంగతనాలను ఆపలేకపోయారు. దొంగతనాలకు గురి అయినవారు రక్షకభటులకు ఎన్ని విన్నపాలు చేసుకున్నా ప్రయోజనం లేకపోయింది.

ఇలా ఎందుకు జరుగుతున్నదన్న ప్రశ్నకు సమాధానంగా ప్రజలలో ఒక పుకారు వ్యాపించింది. అదేమిటంటే, రక్షకభటులు దొంగలవద్ద లంచాలు తిని, వారిని పట్టుకోవడం లేదని!

రక్షకభటుల దళనాయకుడు, తమను గురించి ప్రజలు ఇలా చెప్పుకోవడం అవమానంగా భావించి, రాజుగారి వద్దకు వెళ్ళి ఫిర్యాదు చేసుకున్నాడు.

రాజు అతని ఫిర్యాదు విని, "దొంగలను పట్టుకోవాలని కదా మిమ్మల్ని నియమించాను? కాని దేశంలో దొంగతనాలు సాగుతూనే ఉన్నాయి. అందుచేత ప్రజలు అనుకునేది నిజమైనా కావాలి, లేదా మీరు అసమర్థులైనా కావాలి." అని మందలించి పంపేశాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

ఇది రక్షకభటులకు అవమానంగా తోచింది. అంతా కలిసి పెద్ద ఎత్తున సమ్మె చేయాలనీ, పని మానేయాలనీ అనుకున్నారు. ఈ సంగతి తెలిసి, అటు రాజూ, ఇటు ప్రజలూ కూడా భయపడ్డారు. ఎందుకంటే, రక్షకభటులు సమ్మె చేస్తున్నారని తెలిస్తే, దొంగలంతా విజృంభించిపోవచ్చు!

తాము దేశానికి చేస్తున్న సేవ గురించి రాజు ప్రజలందరి ముందూ ప్రశంసిస్తేనే సమ్మె మానేస్తామని రక్షకభటులు చెప్పారు. ఇది కాస్త ఆలోచించవలసిన విషయం కాబట్టి రాజు వ్యవధికోరాడు. ఈలోగా రక్షకభటులు ఇల్లు కదలడం మానేశారు. అలా ఒకనెల గడిచినాక రాజుకు, ప్రజాక్షేమం దృష్ట్యా, రక్షకభటుల షరతును ఒప్పుకోవాలనిపించింది.

అయితే ఈలోగా కొందరు ప్రజా ప్రతినిధులు ఆయనను కలుసుకుని, ''మహారాజా, రక్షకభటుల సమ్మె గురించి మీరు దిగులుపడ వద్దు. వారిని బహిరంగంగా ప్రశంసించవలసిన అవసరం కూడాలేదు,'' అన్నారు.

''ఎందుకని?'' అని రాజు అడిగాడు.

''వారు సమ్మె ఆరంభించినప్పటి నుంచీ దేశంలో దొంగతనాలు పూర్తిగా నిలిచిపోయాయి,'' అన్నారు ప్రతినిధులు.

రాజు ఆశ్చర్యపడి విచారించగా, దేశంలో ఉండిన దొంగలందరూ ఏనాడో మారిపోయారనీ, రక్షకభటుల్లోనే కొందరు దొంగతనాలకు పూనుకున్నారనీ తెలిసింది.

తాము తలపెట్టినసమ్మె తమ నేరాన్నే బయట పెట్టడంతో రక్షకభట దళనాయకుడు సిగ్గుపడి, సమ్మె ఆపుచేసి, రాజుకు క్షమాపణ చెప్పుకున్నాడు.

రాజు కూడా అప్పటి నుంచీ రక్షకభటుల అధికారాలు తగ్గించి, వారి మీద కూడా కొంతనిఘా ఏర్పాటుచేశాడు. ఎందుకంటే అవినీతి, అన్యాయాలకు ఒక పరిష్కారమంటూ లేదు. ఎప్పటికప్పుడు వాటికి కొత్త పరిష్కారాలు వెతుక్కోవలసిందే!





# సముద్ర మథనం

దేవదానవ యుద్ధం దీర్ఘకాలం కొనసాగింది. తాము అమృతం తాగి మరణాన్ని జయిస్తే తప్ప తమకు విజయం చేకూరదని దేవతలు గ్రహించి, ఆ అమృతం కోసం మేరుపర్వత ప్రాంతంలో వెతికారు.



కాని, ఎంత వెతికినా వారి అన్వేషణ ఫలించలేదు. చివరకు బ్రహ్మ వారితో, సముద్రాన్ని చిలికితేగాని వారికి అమృతం లభించదని అన్నాడు. దానవులు సహాయపడితే గాని సముద్ర మథనం సాధ్యం కాదు.



అమృతం సాధించగలందులకు దానవులు దేవతలతో సహకరిస్తామన్నారు. చిలుకు కవ్వంగా మందర పర్వతాన్ని ఉపయోగించటానికి నిర్ణయం జరిగింది. కవ్వం తాడుగా ఉండమని దేవతలు నాగరాజైన వాసుకిని వేడితే, వాసుకి సరేనన్నాడు.



విష్ణువు కూర్మావతారం ఎత్తి, తాబేలు రూపంలో కొండను తేల్చి ఉంచక పోయినట్టయితే అది మునిగి ఉండేదే. దానవులు వాసుకి తలా, దేవతలు తోకా పట్టుకుని ఒక యుగం పాటు సముద్రాన్ని చిలికారు.



త్వరలోనే వాసుకి నోట వెలువడిన విష జ్వాలలు అన్ని వైపులా వ్యాపించి, లోకం నాశనం అయే ప్రమాదం ఏర్పడింది. అప్పుడు దేవతలు శివుణ్ణి ప్రార్థించగా, ఆయన ఆ హాలాహలాన్ని తన కంఠందాకా దిగమింగి, నీల కంఠుడని పేరు తెచ్చుకున్నాడు.



తరవాత సముద్రం నుంచి అనేక వస్తువులు పుట్టుకొచ్చాయి: చంద్రుడూ, లక్ష్మిదేవీ, ఐరావతం అనే తెల్ల ఏనుగూ... దేవదానవులు సముద్ర మథనం మానలేదు.

చిట్టచివరకు అమృత భాండం చేత బట్టుకుని, ధన్వంతరి సముద్రం నుంచి పుట్టుకొచ్చాడు. అతను తరవాత దేవతల వైద్యుడయాడు. సముద్ర మథనం విజయవంతమయింది.





దానవులు ఆత్రంగా అమృతం కోసం ఎగబడ్డారు. హెచ్చరిక పొందిన దేవతలు అమృతాన్ని దానవుల నుంచి రక్షించ యత్నించారు. అమృతం కోసం దేవదానవులు ఘర్షణపడుతూంటే, ధన్వంతరి నిస్సహాయుడై చూస్తూ ఉండిపోయాడు.

అకస్మాత్తుగా అక్కడ ఒక అపురూప సౌందర్యవతి ప్రత్యక్షమయింది. ఘర్షణ నిలిచిపోయింది. ఆమె ఉభయపక్షాలకూ తానే అమృతం పంచుతానన్నది. ఆమె అందానికి సమ్మోహితులైన దానవులు అందుకు సమ్మతించారు.





అలా మోహిని రూపంలో వచ్చినవాడు విష్ణువే. దానవులు అమృతం తాగి చావును జయిస్తే, అందువల్ల మదమూ, దురన్యాయమూ విజృంభించి, ప్రపంచం నరకంగా మారుతుందని ఆయనకు తెలుసును. మోహిని దేవతలకు అమృతం పోయసాగింది.



రాహువు అనే దానవుడు మోహినిని శంకించి, దేవత రూపంలో వచ్చి తన వంతు అమృతం తీసుకున్నాడు. కాని ఈ మోసం గ్రహించి విష్ణువు, అమృతం రాహువు కంఠం దిగేలోపుగా తన సుదర్శన చక్రం ప్రయోగించి, రాహువు తల నరికాడు.



దానవులు మోసం గ్రహించే లోపల అంతా మించిపోయింది. వారికి అమృతం మిగలలేదు. దేవతలు మాత్రం "అమరులు" అయారు. వారు వీరోచితంగా పోరాడి, దానవులను వారు దురాక్రమణు చేసిన స్థలాల నుంచి పారదోలారు.

# భార్యల ప్రభావం

సోమన్నా, రామన్నా అన్నదమ్ములు. పెద్దవాడు సోమన్న మహా సోమరి. ఏ పనీ చేసేవాడు కాదు. రామన్న పొలం పనులన్నీ చేసి డబ్బు గడించేవాడు. దానితోనే ఉమ్మడి కుటుంబం సాగుతూ ఉండేది.

సోమన్న భార్య తెలివయినది. "చిన్నవాడు కష్టపడి సంపాదిస్తూంటే కూర్చుని తినడానికి సిగ్గు లేదూ? మీరు కూడా పొలం పనులు చెయ్యండి," అని భర్తతో తరచు అనేది.

రామన్న భార్యకి తన భర్త కష్టపడి పని చెయ్యటమూ, తన బావగారు ఒళ్ళు మీదు కట్టుకు కూర్చోపెటమూ నచ్చక, తన భర్తతో, "మీ రొక్కరే ఎందుకు ఒళ్ళు హూనం చేసుకోవాలి? మీరు కూడా హాయిగా తిని కూర్చోండి," అని ఎప్పుడూ అనేది.

కాలక్రమాన ఇద్దరు భర్తలమీదా భార్యల ప్రభావం పడింది. సోమన్న తన సోమరితనానికి సిగ్గుపడి, పనిలో కలగజేసుకుని, త్వరలోనే మంచి రైతుగా తయారయ్యాడు.

రామన్న విశ్రాంతి మరిగి, పనిచేసే అలవాటు తప్పి, సోమరిగా తయారయాడు.

—ఇంద్రగంటి నరసింహమూర్తి





# గురిలేని వైద్యం

ఒక ఊళ్ళో రామశాస్త్రి అనే నాటు వైద్యుడు ఉండేవాడు. ఆయన మూలికా వైద్యంతో ఎలాటి దీర్ఘ రోగాలనైనా ఇట్టే కుదిర్చేవాడు. ఆ చుట్టుపట్ల రామశాస్త్రి వైద్యం గురించి కథలుగా చెప్పుకునేవారు. అతను డబ్బు గురించి తాపత్రయపడకుండా, ప్రజలను రోగవిముక్తులను చెయ్యటమే లక్ష్యంగా పెట్టుకుని వైద్యం చేసేవాడు. అయినా అతనికి మంచి రాబడి ఉండేది. ఎందుకంటే అతని వద్దకు వచ్చే రోగులసంఖ్య చాలా హెచ్చు.

రామశాస్త్రికి గోవిందుడు ఒకడే కొడుకు. గోవిందుణ్ణి కూడా తనలాగే వైద్యుడుగా తయారుచేద్దామని రామశాస్త్రి అనుకున్నాడు. కాని గోవిందుడికి తండ్రి సంపాదన అంటే ఉన్న గౌరవం తండ్రి వైద్యం అంటే లేదు. తన తండ్రి చేసే చికిత్సలు కేవలమూ చిట్కాలనీ, ఆయనది శాస్త్రీయమైన వైద్యం కాదనీ అతని నమ్మకం. అందుచేత రామశాస్త్రి అతన్ని వైద్యం నేర్చుకో మన్నప్పుడు అతను, పట్నంలో శాస్త్రీయమైన వైద్యం నేర్చుకుంటాను గాని, బైరాగి చిట్కాల నాటు వైద్యం తనకు వద్దన్నాడు. తనకు తెలియని వైద్యం కొడుకు నేర్చుకుంటే తన వైద్యం మరింత రాణిస్తుందని రామశాస్త్రి కొడుకును పట్నం పంపాడు.

పట్నంలో గోవిందుడు డబ్బు తగలేస్తూ, విద్యపట్ల చాలా అశ్రద్ధ చూపి, చివరకు పళ్ళబిగువున ఆ వైద్యవిద్య పూర్తిచేసి, ఇంటికి తిరిగి వచ్చాడు.

రామశాస్త్రి గోవిందుణ్ణి తనను మించిన వైద్యుడుగా అందరికీ పరిచయం చేసి, తన దగ్గిరికి వచ్చే రోగులను గోవిందుడికి చూపనారంభించాడు. అయితే గోవిందుడికి రోగనిదానంలో ఏ మాత్రమూ

బుర్లె నాగేశ్వరరావు

నైపుణ్యం లేదనీ, తీవ్ర రోగాలతో బాధ పడుతున్న వారికి గోవిందుడి చేత చికిత్స చేయించటం అపాయకరమనీ రామ శాస్త్రికి త్వరలోనే తెలిసి వచ్చింది. చిన్న చిన్న రోగాలను కూడా గోవిందుడు ముదర బెట్టి పెద్దరోగాలు చెయ్యటమూ, రామశాస్త్రి వాటికి చికిత్స చెయ్యవలసి రావటమూ కూడా జరిగింది. ఈ విధంగా రామశాస్త్రికి కనువిప్పు కలిగిందే గాని, గోవిందుడు తన వైద్యమే గొప్పదనీ, తండ్రికి ఏమీ తెలియదనీ నమ్ముతూ వచ్చాడు. తన తండ్రి చేసే చిట్కావైద్యం మూలంగా తనకు వైద్యుడుగా పేరు ప్రఖ్యాతులు రావటం లేదని గోవిందుడు తండ్రితో అని, అతన్ని వైద్యం చాలించ మన్నాడు.

గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్టు తోచింది రామశాస్త్రికి. అతను గోవిందుడితో, "నిజమేరా, నాయనా! నా చిట్కా వైద్యం ఈపల్లెటూరికి చాలు. కాని నీవంటి ఘనవైద్యుడు బస్తీలోగాని రాణించడు. నువు పట్నంలో వృత్తి ప్రారంభించు," అన్నాడు.

గోవిందుడికి ఈ మాట సబబుగా తోచింది. అయితే అతను పట్నంచేరే లోపుగా జబ్బుచేసి, చాలా కొద్దికాలంలో తీవ్రస్థాయికి వచ్చేసింది. రామశాస్త్రి జబ్బు తగ్గించటానికి తగిన మందులు



ఎంచి ఇచ్చాడు. కాని అవి వీసమెత్తు కూడా పనిచేయలేదు.

నెలరోజులు గడిచినాక, రామశాస్త్రి బాగా ఆలోచించి, ఒకప్పుడు తన వద్ద వైద్యం నేర్చుకొని, దూరగ్రామంలో వైద్య వృత్తి జరుపుకుంటున్న ససురుడు అనే వాణ్ణి పిలిపించి, అతనిచేత తన కొడుక్కు వైద్యం చేయించాడు.

ససురుడు చేపట్టగానే గోవిందుడి వ్యాధి తిరుగుముఖంపట్టి, అతను త్వర లోనే కోలుకున్నాడు. రామశాస్త్రిలాటి హస్తవాసి గల వైద్యుడికి నెలరోజుల కైనా లొంగని జబ్బు, ఊరూ పేరూ లేని ససురుడి మందులకు ఇట్టె లొంగిందంటే

గ్రామస్థులకు చాలా వింతగా తోచింది. అందరూ ససురుణ్ణి రామశాస్త్రి ముఖానే పొగడారు.

తన పని పూర్తి అయింది గనక ససురుడు తన గ్రామానికి తిరిగి వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. కాని రామశాస్త్రి అతన్ని వారించి, "ఇక మీద నువు ఈ ఊళ్ళోనే ఉండి వైద్యం చెయ్యి. నీకు బాగా గిట్టుబాటు అవుతుంది," అన్నాడు.

"నీ అంతటి వైద్యుడుండగా నేనెందుకు ?" అన్నాడు ససురుడు.

"నేను రేపే ఇక్కడినుంచి వెళ్ళిపోతున్నాను," అన్నాడు రామశాస్త్రి.

"ఈ ఊళ్ళో నీకు ఎంతో కీర్తి, డబ్బూ లభించాయి గద? అలాటప్పుడు ఊరు వదిలి పోవటం దేనికి ?" అని ససురుడు అడిగాడు.

"వైద్యుడుగా ఈ ఊళ్ళో నాకు అపకీర్తి వచ్చేసింది. నా కొడుకు రోగం మూలంగా నా మందులలో ఊరివాళ్లకు విశ్వాసం పోయింది. రోగులకు గురిలేని వైద్యం పనిచెయ్యదు," అన్నాడు రామశాస్త్రి.

"నువు చెప్పిన మందులతోనే గదా నీ కొడుక్కు చికిత్స చేసి నయంచేశాను," అన్నాడు ససురుడు ఆశ్చర్యంగా.

"అవును, కాని ఆ మందులే నేనిచ్చినప్పుడు నా కొడుకు వ్యాధి నిమ్మళించలేదు. అందుకు కారణం, నా కొడుక్కు నా వైద్యంలో నమ్మకం లేకపోయింది. అందుకే నిన్ను పిలిపించి, నీ ద్వారా వైద్యం చేయించాను. దాని ఫలితంగా ఊళ్ళో అందరికీ నా మీద గురిపోయింది. నువు నలుగురు పిల్లలు గలవాడివి. ఈ ఊరివాళ్ళు సంపన్నులు. ఇక్కడ చేరితే నీకు దారిద్ర్యబాధ ఉండదు. నేను నాకు కావలసినది ఎక్కడైనా సంపాదించుకోగలను," అని రామశాస్త్రి తన భార్యతో సహా మరో గ్రామానికి వెళ్లాడు. ససురుడు ఆ ఊళ్లో వైద్యవృత్తి సాగించి, ముందే మంచిపేరువచ్చి ఉండటాన బాగా డబ్బుసంపాదించాడు.



మరిచిపోయిన మీ చిన్నతనం తిరిగి అనుభవించండి,'' అంటున్నాడు.

డేరా లోపలి నుంచి బయటికి వచ్చే వాళ్లు విరగబడి నవ్వుకుంటూ వస్తున్నారు. లోపల అంత ఆనందం ఏమున్నదో చూద్దామన్న కుతూహలంతో శ్రీపతి తన భార్యతో సహా డేరాలో ప్రవేశించి, వెంటనే పదేళ్ళ పిల్లవాడుగా మారిపోయాడు. మరి కొద్ది సేపటికి భూపతి కూడా తన భార్యతో డేరాలోకి వచ్చి, తాను కూడా పదేళ్ళ కుర్రవాడుగా మారిపోయాడు. వారి భార్యలు ఇద్దరూ అయిదారేళ్ళ పిల్లలుగా మారి, తమకు తెలిసిన పిల్లలు కనబడక బయటికి వెళ్ళి, మళ్ళీ మామూలు మనుషులయిపోయారు.

ఇద్దరూ తమ భార్యలను గుర్తించ లేదుగాని, ఒకరినొకరు గుర్తించి స్నేహ భావంతో కౌగలించుకుని, డేరాలో ఉన్న మిగతా పిల్లలతోబాటు తాము కూడా ఆడుకున్నారు. అక్కడ పిల్లల ఆటలకు కావలసిన ఉయ్యాలలూ, జారుడు బండలూ మొదలైనవి ఎన్నో ఉన్నాయి. శ్రీపతీ, భూపతీ ఈ ఆటలన్నీ ఆడారు. అప్పటి కింకా వాళ్ళు ప్రాణస్నేహితులు. ఒకే బడిలో చదువుకుని, కలిసి తిరిగారు. ఒకసారి శ్రీపతి ఈత రాక మడుగులోపడి మునిగిపోతుంటే, ఈత వచ్చిన భూపతి వాణ్ణి రక్షించాడు. మరొకసారి భూపతికి కాలు బెణికి కదలలేని స్థితిలో ఉంటే శ్రీపతి వాణ్ణి ఆమడదూరం మోసుకుని,



ఇంటికి చేర్చాడు. ఇలాటి విషయాలు ఇప్పుడు వాళ్ళిద్దరూ ఎన్నో జ్ఞాపకం చేసుకున్నారు.

డేరాలోనుంచి బయటికి రాగానే వాళ్లు మళ్ళీ పెద్దవాళ్ళయారు. కాని వాళ్ళ మనసులు మాత్రం ఎంతగా మారి పోయాయి. డేరా లోపల ఉండిన మనస్థితి బయటికి వచ్చినా మారలేదు. వాళ్ళ భార్యలు అదివరకే బయటికి వచ్చి, వాళ్ళకోసం ఎదురు చూస్తున్నారు. కాని వాళ్ళకు ఆ భార్యల గొడవ పట్టనేలేదు. ఒకరి నొకరు చంపుకోవటానికి తిరుగు లేని ఏర్పాట్లు ఇద్దరూ చేసుకుని ఉన్నారు. అవి అమలు జరగటానికి వీలులేదు. వాళ్ళు ప్రాణస్నేహితులు! ఒకరి నొకరు చంపుకోవట మేమిటి? అసంభవం!

అప్పటికే చీకటి పడుతున్నది. శ్రీపతి తన భార్యను ఎరిగిన వాళ్ళవెంట బండిలో రమ్మని, భూపతితో చెప్పనైనా చెప్ప కుండా అతివేగంగా ఊడలమర్రి ప్రాంతా నికి బయలుదేరాడు. నిజానికి భూపతి శ్రీపతిని గమనించే స్థితిలోలేడు. అతను కూడా తన భార్యను ఎరిగినవాళ్ళ బండిలో ఎక్కించి, తాను కూడా వేగంగా బయలుదేరాడు.

భూపతి రొప్పుతూ, రోజుతూ మర్రిని చేరుకుని, తన కిరాయి మనుషులను అక్కడి నుంచి పంపించివేశాడు. అదేవిధంగా శ్రీపతి చెరువుగట్టు కింది మనుషులను కూడా పంపించి వేశాడు.

స్నేహితు లిద్దరూ క్షేమంగా ఇళ్ళు చేరుకున్నారు. వాళ్ళు తమమధ్య పెరిగిన విరోధం గురించి ఆలోచించుకుంటే అదేదో పీడ కలలాగా కనపడింది. మర్నాడు వాళ్ళు వీధిలో కలుసుకున్నప్పుడు తాము తలపెట్టిన దుర్మార్గం గురించి ఒకరి కొకరు చెప్పుకున్నారు. కాని వారి స్నేహ భావంలో మార్పురాలేదు. పిల్లల డేరాలో ప్రవేశించక ముందు జరిగినదంతా వాళ్ళ కిప్పుడు అవాస్తవంగా కనబడింది. వాళ్లు బతికినన్నాళ్ళూ ఆదర్శస్నేహితులుగానే బతికారు.



# అందుబాటు

సుందరయ్య అనే వైద్యుడు పారుగూరి నుంచి వచ్చి, జమీందారుగారి ఇంటి పక్కనే మకాం పెట్టి వైద్యం చేయనారంభించాడు. త్వరలోనే జమీందారుగారికి, సుందరయ్యకూ మంచి సేహ్నం కుదిరింది. జమీందారుగారు అస్వస్థుడుగా ఉన్నప్పుడల్లా సుందరయ్య వైద్యం చేసేవాడు.

ఒకనాడు జమీందారు వైద్యుడితో, "ఈ మధ్య నాకు తరచుగా ఆరోగ్యం చెడుతున్నది, ఎందువల్ల?" అని అడిగాడు.

వైద్యుడు జమీందారుకు ఏదో నచ్చచెప్పి, మర్నాడే తన ఊరికి మకాం మార్చుతూ, "తమకు అవసరం కలిగినప్పుడు కబురుచేస్తూండండి," అని జమీందారుతో చెప్పి వెళ్లిపోయాడు.

చాలా రోజులు గడిచాయి. జమీందారు నుంచి ఎటువంటి కబురూ రాలేదు. వైద్యుడు ఒకనాడు జమీందారును చూడబోయి, "నాకు కబురు చెయ్యలేదు. తమ ఆరోగ్యం బాగున్నది గద?" అన్నాడు.

"కబురు చెయ్యవలసిన అవసరం రాలేదు," అన్నాడు జమీందారు.

"ఎవరికైనా సరే, అందుబాటులో ఉంటే అవసరం ఎక్కువవుతుంది," అన్నాడు వైద్యుడు.

—అరుపల్లి గోవిందరావు





# రంగులు మారిన కోడి

ఒక గ్రామంలో ఒక ముసలమ్మ ఒక కోడిపుంజును పెంచింది. తెల్లగా నిగనిగలాడే ఆ కోడిని ఆమె ప్రాణంతో సమానంగా పెంచింది. ఆ వీధిలో అందరూ దాన్ని చూసి ముచ్చట పడేవారు.

ఒకనాడు ఆ పుంజు దీపాలవేళ అయినా ఇంటికి రాలేదు. ముసలమ్మ అందరి ఇళ్లకూ వెళ్లి అడిగింది గాని ఒక్కరూ కోడిపుంజు జాడ చెప్పలేక పోయారు. పాపం, ముసలిది ఆ రాత్రి తిండికూడాసయించక, పస్తుపడుకున్నది.

జరిగినదేమంటే, ముసలమ్మ కోడిపుంజు నాలుగు వీధుల అవతలి చాలా కోళ్ళుంటే, వాటితో చేరిపోయి, గింజలు పొడుచుకుని. తింటూ అక్కడే ఉండిపోయింది. ఆ కోళ్ల యజమాని అయిన రంగయ్య, తన కోళ్లను గూట్లో పెట్టటానికి పిలుస్తూ, తెల్లపుంజును చూశాడు. బాగా కండబట్టి, నిగనిగలాడుతున్న పుంజును చూడగానే దాన్ని ఉంచేసుకోవాలనిపించి, రంగయ్య పుంజుకు పచ్చరంగు వేసి, కోళ్లగూట్లో వదిలేశాడు.

ఆ పుంజు ఆ రాత్రంతా గూట్లోనే ఉండి, మర్నాడు తెల్లవారి రంగయ్య కొడుకు గూడు తెరవగానే తప్పించుకుని పారిపోయింది. ఈ సంగతి తెలియగానే రంగయ్య పుంజును వెతుకుతూ బయలుదేరాడు.

ఈలోగా పుంజు లక్కబొమ్మలు చేసే గోపాలయ్య పెరట్లోకి పోయింది. గోపాలయ్య దాన్ని చూసి, సంతలో అమ్మితే దానికి మంచి ధర వస్తుందనుకుని, దాన్ని పట్టుకుని దాని సొంతదారు గుర్తించకుండా ఉండగలందులకు దానికి తెల్లరంగువేసి, ముంగిట్లో దాన్ని గుంజకు

షేక్ గాలిబ్

# హెచ్చరిక

పూర్వం ఒక దేశంలో గాలివాన వచ్చి విపరీతంగా జననష్టమూ, ఆస్తినష్టమూ జరిగింది. నష్ట పోయిన ప్రజలు రాజు వద్దకు వెళ్ళి సాయం చెయ్యమని కోరారు. సాయం చెయ్యటానికి రాజు అంగీకరించాడు గాని, అది ఎలా చెయ్యాలో తోచలేదు. మంత్రి సలహా రాజుకు నచ్చలేదు.

రాజు గూఢచారుల ద్వారా నష్టపోయినవారి జాబితా తెప్పించాడు. వారికి ధనసహాయం చేస్తే బాగుంటుందో, వస్తు సహాయం చేస్తే బాగుంటుందో ప్రజాభిప్రాయం తెలుసుకురమ్మని మళ్ళీ గూఢచారులను పంపాడు. వాళ్లు కొంతకాలానికి రాజుతో, సగంమంది ధనసహాయం కోరుతున్నారనీ, సగంమంది వస్తు సహాయం కోరుతున్నారనీ చెప్పారు. ఏం చెయ్యాలో తోచక రాజు కర్తవ్యం నిర్ణయించటానికి ఒక సంఘాన్ని వేశాడు. ఆ సంఘం కాలక్రమాన ధనసహాయమే మంచిదని నిర్ణయించింది. రాజు నష్టపోయిన వారికి భారీగానే ధనసహాయం చేశాడు.

తరవాత రాజు మారువేషంలో ప్రజలలోకి వెళ్లి, వాళ్ళే మనుకుంటున్నదీ విని, కోపంతో తిరిగి వచ్చి, మంత్రితో, "ప్రజలు కృతఘ్నులు! వాళ్ళు మన పేరే తలవటం లేదు. గాలివాన తగ్గాక సుబ్బిశెట్టి నాలుగు రోజులు అన్నదానం చేశాట్ట. అతడి పేరు చెప్పుకుంటున్నారు!" అన్నాడు.

"అదనులో అందిన సాయమే లెక్కలోకి వస్తుంది, మహారాజా!" అన్నాడు మంత్రి.

—చెల్లూరి సీతారాజేశ్వరరావు.





# పిల్లల డేరా

శాంతివనం అనే ఊళ్ళో శ్రీపతీ, భూపతీ అనే ప్రముఖులిద్దరు ఉండేవాళ్ళు. ఒకప్పుడు వాళ్ళు మంచి మిత్రులే గాని గ్రామరాజకీయాలూ, అసూయా ద్వేషాలూ వారిని బద్ధ శత్రువులుగా చేశాయి. ఇవి ఎంతదాకా పోయాయంటే, వాళ్ళు ఒకరి కొకరు తీరని ద్రోహాలు చెయ్యటమేగాక, ఒకరినొకరు చంపుకోవాలన్నంత స్థాయికి చేరారు.

నాలుగుకోసుల దూరాన ఉన్న కాళీ పట్నంలో ఏటా తిరణాల జరుగుతుంది. దానికి శ్రీపతీ, భూపతీ కూడా తప్పక పోతారు.

ఈ సారి తిరణాల నుంచి తిరిగి వచ్చేటప్పుడు భూపతిని చంపటానికి శ్రీపతీ, శ్రీపతిని చంపటానికి భూపతీ తీర్మానించుకుని, అవసరం అయిన పథకాలు కూడా వేసుకున్నారు.

దారిలో ఊడలమర్రి ఉన్నది. తిరణాల నుంచి అక్కడికి వచ్చేసరికి చీకటి పడుతుంది. శ్రీపతి మర్రి వద్దకు వచ్చేసరికి అతన్ని చంపటానికి మనుషులను ఏర్పాటు చేశాడు భూపతి. ఊడలమర్రికి ఇవతల చెరువుగట్టు దిగువన మనుషులను పెట్టి, వారిచేత భూపతిని చంపించటానికి శ్రీపతి పథకం వేశాడు.

ఆ ఏడు తిరణాల మహా వైభవంగా జరిగింది. ఈ సారి తిరణాలలో ప్రత్యేకమైన విశేషం ఏమిటంటే పిల్లల డేరా! పేరుకు అది పిల్లల డేరాయేగాని అందులోకి పెద్దలను మాత్రమే పోనిస్తారు. ఆ డేరా ముందు వింత వేషంలో ఒక ముసలాడు నిలబడి ఉన్నాడు. నిజానికి వాడు సిద్ధవిద్యలు ఎన్నో నేర్చిన మాంత్రికుడు. వాడు పెద్దవాళ్ళను ఆహ్వానిస్తూ, " ఈ డేరాలో ప్రవేశించి, ఏనాడో

కలువకొలను సదానంద

కట్టేసి, దానిముందు కాసిని నూకలువేసి, తాను బొమ్మలు చేసుకోసాగాడు.

తెల్లవారుతూనే, తన వీధివాళ్ళను నలుగురిని వెంటబెట్టుకుని వీధి వీధీ తిరుగుతున్న ముసలమ్మ గోపాలయ్య వీధికి వచ్చి, అతని ఇంటి ముందున్న పుంజును చూసింది. ఆమెతోబాటు ఆమె వెంట ఉన్న వారందరూ దాన్ని ముసలమ్మ కోడి అని పోల్చారు. ముసలమ్మ వెంట వచ్చినవారికీ, గోపాలయ్యకూ మధ్య గొడవసాగింది

అటుగా పోతూండిన మునసబు ఆగి, "ఏమిటి ఈ గొడవ?" అని ముసలమ్మను అడిగాడు. తన తెల్లకోడిని గోపాలయ్య ఎత్తుకొచ్చాడని ఫిర్యాదుచేస్తూ ముసలమ్మ తన వెంట ఉన్నవాళ్ళను సాక్ష్యం వేసింది. ఆ తెల్లకోడి ముసలమ్మదేనని అందరూ సాక్ష్యం చెప్పారు.

అప్పుడు గోపాలయ్య, "మునసబు గారూ, ఇది అసలు తెల్లకోడి కాదు. పచ్చకోడి. నేను సరదాకు దీనికి తెల్లరంగు వేశాను," అన్నాడు.

అప్పటికే అక్కడికి చేరిన జనంలో పుంజును వెతుక్కుంటూ వచ్చిన రంగయ్య ఉన్నాడు. ఆయన పచ్చకోడి అన్నమాట వినగానే, "మునసబుగారూ, ఆ పచ్చకోడి నాదే. తెల్లవారిన దగ్గిరనుంచీ దానికోసం వెతుకుతున్నాను. దాన్ని నా



కిప్పించండి," అన్నాడు

"ఇంకొరి కోడిని దొంగిలించి దానికి రంగు వేసినందుకు నీకు పాతిక రూపాయలు జరిమానా!" అన్నాడు మునసబు గోపాలయ్యతో.

రంగయ్య పుంజును తీసుకుపోబోయాడు. కాని ముసలమ్మ దాన్ని పట్టుకొని వదల్లేదు. అది అచ్చు తన తెల్లకోడిలాగే ఉన్నదని ఆమె మునసబుతో అన్నది. రంగయ్య దాన్ని అక్కడక్కడా గుడ్డతో తుడిస్తే, తెలుపు రంగుపోయి పసుపురంగు బయట పడింది.

"చూశావా, ఇది నా పచ్చకోడి," అన్నాడు రంగయ్య.

అప్పటికీ మునలమ్మ అనుమానం తీరలేదు. అందుకని మునసబు చెంబెడు నీళ్లు తెప్పించి, కోడిని శుభ్రంగా కడిగించాడు. మొదట తెల్లరంగు నీళ్లు వచ్చి, తరవాత పచ్చరంగు నీరు కూడా వచ్చింది. చిట్టచివరకు కోడిపుంజు అసలు తెలుపు నిలిచిపోయింది.

"ఇదేమిటి, రంగయ్యా? నీది పచ్చ కోడి అన్నావు; తీరా కడిగితే తెల్ల రంగుది!" అన్నాడు మునసబు.

"నాదే పొరపాటండి. నా పచ్చకోడి అనుకున్నాను. వస్తానండి," అన్నాడు రంగయ్య.

"అబద్ధం, మునసబుగారూ! నేను చూసేసరికి దీనికి పచ్చరంగున్నది," అన్నాడు గోపాలయ్య.

ఇక అబద్ధమాడి లాభం లేదనుకుని రంగయ్య మునసబు కాళ్ళు పట్టుకొని, క్షమాపణ చెప్పుకున్నాడు.

కాని మునసబు అతన్ని క్షమించక, మరొకరి కోడికి రంగువేసినందుకు గోపాలయ్యతోబాటు రంగయ్య కూడా పాతిక రూపాయలు మునలమ్మకు ఇచ్చుకోవాలన్నాడు

ఇద్దరూ మునలమ్మ చేతులు పట్టుకుని క్షమించమని బతిమాలారు.

మునలమ్మ వాళ్ళను చూసి జాలి పడి, "మునసబుగారూ, వీళ్లిద్దరినీ వది లెయ్యండి. ఒకవేళ వీళ్లు నా కోడిని కోసుకుని తినేసి ఉంటే నేనేం చెయ్య గలిగేదాన్ని? నా కోడి నాకు దక్కింది, అంతే చాలు!" అన్నది.

"ఆ ముసలిదాని మంచితనాన్ని చూసి అయినా, మీ యిద్దరూ బుద్ధి తెచ్చుకోండిరా! మరొకసారి ఇలా జరిగితే క్షమించను!" అని మునసబు ముందుకు సాగిపోయాడు.

మునలమ్మ సంతోషంగా తన తెల్లకోడి పుంజును ఇంటికి తీసుకుపోయి, దానికి దిష్టి తీసింది!






మూచవరంలో ఉండిన కూచనసిద్ధాంతికి జ్యోతిషంలో అఖండ పండితుడనే ప్రఖ్యాతి ఉండేది.

ఉన్నట్టుండి కూచనకు తన పేరు బాగులేదని తోచింది. జ్యోతిషంలో ఉద్దండ పండితుడికి కూచన అనే వికారపు పేరేమిటి ? తల్లిదండ్రులు తనకు మంచి పేరు పెట్టలేదని విసుక్కుని, తనకు కూచన అని పేరుపెట్టి . అన్యాయం చేశారని అతను తిట్టుకున్నాడు.

కూచన ఒక రాత్రంతా నిద్రపోకుండా బాగా ఆలోచించి, శంకరుడు గొప్ప దేవుడు కాబట్టి, కూచన అన్న పేరు విసర్జించి తన పేరు శంకరుడు అని మార్చుకోడానికి నిశ్చయించాడు.

మర్నాడు తనను చూడవచ్చినవారు, " కూచన సిద్ధాంతిగారూ ! " అని సంబోధించగా, " ఇవాళ్టినుంచీ నా పేరు శంకరుడు ! నన్ను శంకర సిద్ధాంతి అని పిలవండి." అని చెప్పాడు. కాని మూచవరంలో అందరూ అతన్ని, " కూచన గారూ ! ", " కూచన సిద్ధాంతిగారూ ! " అని పిలిచారేగాని, శంకరసిద్ధాంతి అని పిలవలేదు. పైగా, " పుట్టి పెరిగినప్పట్నించీ తమర్ని కూచనగానే ఎరుగుదుంగాబట్టి, మరో పేరుతో పిలవలేం, బాబూ! కాకపోయినా, అమ్మా, నాన్నా పెట్టిన పేరు మానుకోవడమేమిటి, బాబూ ? " అన్నారు.

సిద్ధాంతికి ఘూచవరం మీద పట్టరాని కోపం వచ్చింది. ఆయన ఆ ఊరు విడిచిపెట్టి, మరొక ఊళ్ళో శంకరసిద్ధాంతిగా స్థిరపడి, పేరుమోశాడు.

ఒకనాడు ఆయన భార్య కట్టెల మోపుతో వెళుతున్న ఒక కట్టెలవాణ్ణి పిలిచి, మోపు బేరమాడుతూ, " కట్టెలు

"పావనం"



బాగా కాల్తాయా? దమ్ముకున్నవి కావు గద?" అని అడిగింది.

దానికి కట్టెలవాడు, "శంకరుడి కట్టెలు మండకపోవడ మేమిటమ్మా? మూడో నేత్రం తెరిచినట్టు అవి భగభగా మండకపోతే నా పేరు శంకరుడే కాదు!" అన్నాడు.

అది విన్న సిద్ధాంతి తెల్లబోయి, "ఎంత పొరపాటు జరిగిపోయిందీ!" అనుకున్నాడు. శంకరుడు అన్న పేరు ఒక కట్టెలవాడికున్నది! అలాటి పేరు తాను ఎంచుకోవడం ఎంత అవివేకం!

సిద్ధాంతి ఆలోచించి, ఆలోచించి, విష్ణుమూర్తిని తలచుకుని, తన పేరు లక్ష్మీపతి అని మార్చుకోడానికి నిర్ణయించుకున్నాడు. ఆ మర్నాటి నుంచీ ఆయన తనకోసం వచ్చినవాళ్ళతో తనను ఇకనుంచి శంకరుడనిగాక లక్ష్మీపతి అని పిలవమని చెప్పాడు.

అయితే ఆ ఊరివాళ్ళలో ఎక్కువ మంది శైవులు. వాళ్ళు ఆయనను శంకర సిద్ధాంతి అనే పిలుస్తామనీ, లక్ష్మీపతి అని పిలవమనీ నిక్కచ్చిగా చెప్పేశారు. సిద్ధాంతికి ఒళ్ళు మండి, ఆ ఊరు విడిచి మరో ఊరికి మకాం మార్చి, లక్ష్మీపతిగా వెలిగాడు.

ఒకనాడు సిద్ధాంతి వీధి సావడిలో కూర్చుని ఏవో జ్యోతిష సంబంధమైన కాగితాలు చూసుకుంటూండగా, ఒక బిచ్చగాడు సొంత కవిత్వంతో, "లక్ష్మీపతి చెప్పింది వినరా, గురుడా!" అని తన పేరున తత్వాలు పాడుతూ వచ్చాడు.

లక్ష్మీపతి సిద్ధాంతి తుళ్ళిపడి, వాడి పేరు అడిగాడు. వాడు తన పేరు లక్ష్మీపతి అని పాడుతూనే చెప్పాడు. లక్ష్మీపతి వాణ్ణి పంపేసి, పెద్ద ఆందోళనలో పడ్డాడు. ఒక బిచ్చగాడి పేరూ, తన పేరూ ఒకటే కావడం ఎంత ఘోరమైన అవమానం! ఆయన ఆలోచించి, ఆలోచించి, తన పేరు చిరంజీవి అని మార్చుకుందామను కున్నాడు.

ఆయన మర్నాడు తనను చూడవచ్చిన వారందరితోనూ తన పేరు చిరంజీవిగా మారిందనీ, తనను అందరూ చిరంజీవి సిద్ధాంతి అని పిలవాలనీ చెప్పాడు. ఆ ఊరి వాళ్ళు ఎక్కువమంది వైష్ణవులు. వాళ్లు ఆయనను లక్ష్మిపతి అనే పిలుస్తామనీ, మరో పేరు తమ నోట రాదనీ చెప్పేశారు.

ఆ ఊరివాళ్ళ మీద మండుకొచ్చి, సిద్ధాంతి మరో ఊరు వెళ్ళి, చిరంజీవి సిద్ధాంతిగా పేరుకెక్కాడు.

ఒకనాటి ఉదయం, వీధి వాకిలి ఊడ్చి ముగ్గుపెట్టే దాసీది వేళకు రాలేదు. ముగ్గు లేని వాకిలి దాటగూడదనే నియమం గల సిద్ధాంతి విసుక్కుంటూండగా, పని మనిషి వచ్చి, ఆలస్యానికి సంజాయిషీ చెబుతూ, "మా ఎదటి గడపలో మూడేళ్ల చిరంజీవి బాబు చనిపోయాడు, బాబూ. లేక, లేక వాళ్ళకు ఒక్కడే పిల్లాడు! ఆ తల్లిదండ్రుల దుఃఖం చూస్తుంటే నాకు కాళ్ళు కదిలాయి కావు," అంటూ చెప్పుకొచ్చింది.

సిద్ధాంతికి పూర్తిగా దిమ్మ తిరిగింది. "చిరంజీవి అని ముచ్చటపడి పేరు పెట్టుకుంటే, మూడేళ్లకే మృత్యువు దాపరించింది! "ఛీ, ముదనష్టపు పేరు నేరక పెట్టుకున్నాను!" అనుకుని, ఆయన తిరిగి తన సొంత ఊరికి బయలుదేరాడు.

అప్పటికే మాచవరంలోని వాళ్ళు, "కూచనను శంకరసిద్ధాంతి అని పిలవక పోతిమే! నిష్కారణంగా గొప్ప సిద్ధాంతిని వదులుకున్నామే!" అని పశ్చాత్తాప పడుతున్నారు.

సిద్ధాంతి మాచవరం చేరేసరికి అక్కడి వాళ్ళు, "ఓహో, శంకరసిద్ధాంతిగారా! బాగున్నారా? ఎప్పుడు తమ రాక? ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు...." అంటూ సంతోషంతో పలకరించారు.

అప్పుడు సిద్ధాంతి తడుముకోకుండా, తన పేరు శంకరుడు కాదనీ, మరేదీ కాదనీ, అమ్మా, నాన్నా ముచ్చటగా పిల్చుకున్న కూచనేననీ, అదే పేరుతో తనను పిలవమనీ సవినయంగా చెప్పాడు.





# దయ్యం వదిలింది

వాణీ, వర్మలకు సంతానం లేదు. వాళ్లు చాలా మంచివాళ్లు. ఆ ఊళ్లో వాళ్ళ మంచితనాన్ని గురించి చెప్పుకోనివారు లేరు.

ఒకరోజు రాత్రి పెద్దవర్షం పడుతున్నది. వర్మా, వాణీ భోజనానికి కూర్చోబోతుండగా ఎవరో దడదడా తలుపులు తట్టారు. తలుపు తీసి చూస్తే, వర్షంలో తడిసి ముద్ద అయి ఉన్న యువదంపతులు కనిపించారు.

"పట్నానికని బయలుదేరి, వర్షంలో చిక్కుపడ్డాం. ఈ రాత్రికి మీ యింట ఉండనిస్తారా ?" అని వాళ్లు అడిగారు.

"లోపలికి రండి," అంటూ వాణి వాళ్ళను ఆహ్వానించి, భోజనం పెట్టి, పడకలు ఏర్పాటు చేసింది.

వాళ్లుతిన్నాక అన్నం కొద్దిగా మిగిలింది. దాన్ని వాణి తన భర్తను తినమన్నది. మళ్లీ వండడానికి పుల్లలు లేవు. తడిసిపోయాయి.

"ఇద్దరమూ చెరిసగమూ తిందాం," అని వర్మ పట్టుబట్టాడు. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ చెరికాస్త తిని, పడుకున్నారు.

తెల్లవారి ఎవరో ఏడుస్తున్నట్టయి వాళ్లు ఉలిక్కిపడి లేచారు. వీధి తలుపు తీసి ఉన్నది. గుమ్మంలో రాత్రి వచ్చిన మనిషి కూర్చుని, వెక్కివెక్కి ఏడుస్తున్నది. వాణీ వర్మలు నిర్ఘాంతపోయి, ఆమె ఏడుపుకు కారణం ఏమిటని అడిగారు.

"నా కాపరం గంగపాలయింది! రాత్రి ఈ ఇంటికి రాకపోయినా బాగుండేది. రాత్రి నా భర్త మీ అన్యోన్యం చూసి, 'నువు ఎన్నడైనా నన్ను ఈ ఇంటి ఇల్లాలి లాగా ప్రేమించావా? భర్తను ప్రేమించ

మాచిరాజు కామేశ్వరరావు

లేని భార్య నాకు దేనికి?' అని, ఎంత చెబుతున్నా వినిపించుకోకుండా వెళ్ళి పోయాడు. మొండి మనిషి! మళ్ళీ తిరిగి రాడు.'' అన్నది బెక్కుతూ.

ఆమె పేరు చంద్రమతి.

వర్మ ఆమె భర్తకోసం ఆత్రంగా ఊరంతా వెతికాడు. ఎక్కడా అతని జాడ లేదు.

''నాకు తెలుసు. ఆయన రాడు. నా కింకెవరూ లేరు. లోతయిన బావి చూసి దూకేస్తాను,'' అంటూ చంద్రమతి మళ్ళీ ఏడ్చింది.



ఆమె స్థితి చూసి భార్యాభర్తల మనసు కరిగిపోయింది. మగవాడి మంచితనం మీదనే ఆడవాని సుఖం ఆధారపడి ఉన్నది.

''నువు ఏమీ బాధపడకు. నీ భర్త మనసు మారి తిరిగి వచ్చేదాకా నువు మా ఇంటనే ఉండు,'' అన్నారు వాళ్ళు.

అది మొదలు చంద్రమతి వాళ్ళింట్లో మనిషిగానే ఉండిపోయింది. ఆమె చాలా మెత్తని మనిషిగా కనబడింది. రాత్రి వంట ఆమే చేసేది.

నెల రోజులు గడిచాయి. వర్మకు చిన్ననాటి స్నేహితుడు మురారి, నాలుగు రోజులు ఉండిపోవటానికి వచ్చాడు. అతడు రెండు, మూడు నెలల కొకసారి అలా వస్తూంటాడు: కిందటిసారి వచ్చి నప్పుడు చంద్రమతి లేదు. అతడు ఆమె విషయమంతా వర్మ నుంచి తెలుసు కున్నాడు. ఆ రాత్రి అందరికీ చంద్రమతే వడ్డించింది. భోజనం అయాక మురారి వసారాలో మంచం వేసుకుని పడు కున్నాడు.

కాని అతనికి చాలాసేపటిదాకా నిద్ర పట్టలేదు. అర్ధరాత్రి వేళ నిద్రపట్టు తూండగా ఏదో అలికిడి అయి, మెలుకువ వచ్చింది. చంద్రమతి చేతిలో దీపం పట్టుకుని, చిన్నగా వంటింటి తలుపు తీస్తున్నది! వంటింటి అవతలి కిటికీని ఎవరో తట్టినట్టు వినిపించింది.



మురారికి చంద్రమతి ప్రవర్తనా, కిటికీ చప్పుడు అనుమానం కలిగించాయి. ఆమె వంట గదిలోకి వెళ్ళగానే అతను చప్పున లేచి, చిన్న కిటికీలో నుంచి వంటగది లోకి చూశాడు. చంద్రమతి ఒక గిన్నెలో అన్నమూ, కూరా, పులుసూ, పెరుగూ అమర్చి, కిటికీలో నుంచి లోపలికి వచ్చిన చేతులకు అందించింది.

"ఇంకా ఎన్నాళ్ళు ఈ అర్ధరాత్రి భోజనాలు? ఎలాగో ఇనప్పెట్టెలో డబ్బు చిక్కించుకుని త్వరగా వచ్చెయ్యి," అన్నాడు అవతలి మనిషి. చీకటిలో ఉన్న కారణంచేత ఆ మనిషి మురారికి కనిపించలేదు.

"ఇప్పుడిప్పుడే వీళ్ళకు నా మీద నమ్మకం కలుగుతున్నది. త్వరలోనే ఇనప్పెట్టె తాళాలు నాకు అందుబాటులోకి వస్తాయి. కాస్త ఓపికపట్టు," అన్నది చంద్రమతి.

"అమ్మ దొంగముండా! పైకి అమాయకంగా కనిపిస్తూ, మావాళ్ళ మంచితనాన్ని ఆసరాచేసుకుని, మొగుడితో కలిసి ఆడుతున్న నాటకం ఇదా? ఉండు, నీ ఆట కట్టిస్తాను!" అంటూ మురారి తనలో అనుకున్నాడు. అతను వెంటనే వెళ్ళి పడుకుని, చంద్రమతి గురించి వాణీ, వర్మలకు చెప్పి వాళ్ళ మనసు నొప్పించకుండా, వాళ్ళ యింటిని పట్టిన దయ్యాన్ని వదలగొట్టాలని నిశ్చయించుకున్నాడు.

మర్నాడు తెల్లవారుతూనే అతను చంద్రమతికి వినిపించేలా వర్మతో, "బాబోయ్, రాత్రి నేను కన్నుమూస్తే ఒట్టు. ఈ ఇంట్లో దయ్యం చేరినట్టున్నది. రాత్రంతా గజ్జెల చప్పుడు! నేను తూర్పుగా వేసుకున్న మంచం పడమటి వైపుకు ఈడ్చుకు పోయింది. కిటికీలో పెట్టిన మంచినీళ్ళ గిన్నె మంచం కింద ఉన్నది. నేను కాబట్టి బతికి బయట పడ్డాను," మరొకరైతే, హరీ అనేవాళ్ళు, అన్నాడు.

వాణీ, వర్మా ఈ మాట విని హడలి పోయి, "అయితే భూత వైద్యుణ్ణి పిలుద్దాం," అన్నారు.

"మీరేమీ కంగారుపడకండి. ఎటు వంటి దయ్యాన్ని అయినా నేను వదల గొట్టగలను," అని మురారి వాళ్ళకు ధైర్యం చెప్పాడు

మర్నాడు రాత్రి అతను బజారులో కొన్న గజ్జెలు పక్కన పెట్టుకొని, అప్పు డప్పుడు చప్పుడు చేయసాగాడు. తరవాత అతను తలగడను మంచంమీద నిలువుగా అమర్చి, వాటిమీద దుప్పటి కప్పి, పెరటివైపు వెళ్లి, వంటింటి కిటికీ చప్పుడు చేశాడు.

చాలాసేపటికి ఎలాగో ధైర్యం చేసుకుని, చంద్రమతి వచ్చి, గిన్నెలో అన్నీ సర్ది, మురారి చేతులకు గిన్నెను అందించింది. మురారి చప్పున ఇంట్లోకి వచ్చి, ఆ గిన్నెను చంద్రమతి మంచం మీద పెట్టి, మంచాన్ని ఇంకో పక్కకు ఈడ్చేసి, ఏమీ ఎరగనట్టు తన మంచం మీద పడుకున్నాడు.

చంద్రమతి గిన్నె కోసం కొంతసేపు చూసి, కిటికీని సమీపించి, బయట తన భర్త జాడ కనబడక, వంటగది తలుపు మూసి, తనగదిలోకి వెళ్లి, కెవ్వున కేక పెట్టింది. ఆ కేకకు వర్మా, వాణీ ఉలిక్కి



పడి లేచి, చంద్రమతి దగ్గరకు పరుగెత్తు కుంటూ వచ్చారు. అప్పుడే లేచినట్టుగా మురారి కూడా వచ్చాడు.

చంద్రమతి చెదిరిపోయిన గొంతుతో, "దయ్యం ఉన్నమాట నిజమే! నాకూ గజ్జెల చప్పుడు వినిపించింది ఆ వైపున ఉన్న మంచం ఈ వైపుకు వచ్చింది. దానితో అదురుకుని లేచాను. ఇదుగో, వంటింటిలో ఉన్న ఈ గిన్నె నా మంచం మీదికి వచ్చింది," అన్నది.

"భయపడకండి. త్వరలోనే ఈ దయ్యం భరతం పట్టుతాను," అన్నాడు మురారి. రెండు రోజులపాటు అతను రాత్రిళ్లు గజ్జెలచప్పుడు చేస్తూనే ఉన్నాడు.

అందుకే, తన భర్త వంటింటి కిటికీ చప్పుడు చేస్తున్నా చంద్రమతి గది విడిచి బయటికి రావటానికి భయపడింది.

మూడో రోజు రాత్రి మురారి బయటనే పొంచి వుండి, చంద్రమతి భర్త పెరటి దోవన రాబోతుండగా, తాను అదే దారిన వెళ్ళబోతున్నవాడిలాగా అతనికి ఎదురు నడుస్తూ, "నా చెల్లెలికి ఇంత ద్రోహం చేస్తాడా? నేను చూస్తాను!" అని తనలో తాను అనుకుంటున్నట్టుగా అన్నాడు.

చంద్రమతి భర్త బయటే నిలబడి, "ఏం జరిగిందండి?" అని అనుమానంగా అడిగాడు.

"ఇంకా ఏం జరగాలండీ? ఈ ఇంటాయన మా బావగారు మా చెల్లెలికి పిల్లలు లేరు. ఈ ఇంట్లో ఎవరో మొగుడు వదిలేసిన మనిషి ఎలాగో చేరింది. ఇప్పుడు మా బావ ఆవిణ్ణి చేసుకుంటాడట! ఆవిడ కూడా అందుకు సిద్ధంగానే వున్నది!" అంటూ విసురుగా వెళ్ళిపోయి నట్టువెళ్ళిపోయి, వీధితోవనలోపలికివచ్చి, తనమంచంమీదపడుకునినిద్రపోయాడు.

మురారి చెప్పినమాటమీద చంద్రమతి భర్తకు నమ్మకం కుదిరింది. ఎందుకంటే మూడురోజులుగా ఆమె అతనికి కిటికీ తెరవటంలేదు. తెల్లవారగానే అతను వచ్చి వర్మతో, "నేను బుద్ధి గడ్డి తిని నా భార్యను ఇక్కడ వదిలి వెళ్ళాను. ఆమెను నాతో పంపెయ్యండి." అన్నాడు.

దయ్యం భయంతో హడలిపోతున్న చంద్రమతి తన మొగుడి వెంట సంతోషంగా వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళినందుకు ఇల్లు బోసిగా ఉన్నదని వాణి, వర్మలు బాధ పడుతూంటే, "దయ్యం వదిలిందని సంతోషించక బాధ పడుతున్నారా?" అంటూ మురారి జరిగిన సంగతి వాళ్ళకు చెప్పి, వాళ్ళ వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.





# దేవీ భాగవతం

దేవదూత ఇంద్రుడి వద్దకు తిరిగి వెళ్లి చంద్రుడాడిన మాటలన్నీ చెప్పాడు.

"ఇలాటి పాడుపని చేసి కూడా చంద్రుడి కింత సాహసమా?" అని ఇంద్రుడు చంద్రుడి మీదికి యుద్ధానికి తలపడ్డాడు. ఇది తెలిసి శుక్రుడు తన శిష్యబృందంతో చంద్రుడికి సహాయం వచ్చాడు. శివుడు బృహస్పతికి సహాయం వచ్చాడు. ఉభయ పక్షాలకూ యుద్ధంసాగింది.

అప్పుడు బ్రహ్మదేవుడు వచ్చి చంద్రుడితో, "నువు బృహస్పతి భార్యను వదిలి పెట్టు. లేకపోతే విష్ణువుతో చెప్పి నీ మదం అణిగిస్తాను," అన్నాడు. తరవాత ఆయన శుక్రుడితో, "బృహస్పతి మీది పగచేత ఇలా చంద్రుడికి సహాయం వస్తావా? ఇక ఏ ఆడదైనా మొగుడితో కాపరం చేస్తుందా?" అన్నాడు.

శుక్రుడు చంద్రుడితో తారను విడిచి పెట్టమన్నాడు. గర్భవతిగా ఉన్న తారను చంద్రుడు బృహస్పతికి ఇచ్చేశాడు. శివుడు మొదలైనవాళ్లు వెళ్ళిపోయారు. తార బృహస్పతి ఇంటికి వచ్చి ఒక కొడుకును కన్నది. ఆ పిల్లవాడికి బృహస్పతి జాతకర్మ చేయబోతూండగా చంద్రుడి దూత వచ్చి, చంద్రుడి తరఫున, "వీడు నీ కొడుకు కాదు, నాకు పుట్టినవాడు. వాడికి నువు ఎలా జాతకర్మ చేస్తావు?" అని అడిగాడు.

బృహస్పతి చంద్రుడి దూతతో, "నా పోలికలున్నాయి. వీడు నా కొడుకే

3. శుకుడి జననం



చంద్రుడి రూపురేఖలు వీడిలో లేవు.'' అని చెప్పి పంపాడు. దూత చంద్రుడితో అదంతా చెప్పాడు.

వెంటనే చంద్రుడు రాక్షసగణాలను వెంటబెట్టుకుని మళ్ళీ యుద్ధానికి వచ్చాడు.

ఆగిపోయిన దేవదానవ యుద్ధం తిరిగి ఆరంభమయింది.

అప్పుడు బ్రహ్మ వచ్చి, యుద్ధం వద్దని చెప్పి, ఈ పోట్లాటలకు మూలకారకురాలైన తారతో, ''నీ మూలంగా ఎంత బెడద వచ్చిపడిందో చూడు. ఇంతకూ నువు కొడుకును ఎవరికి కన్నావు? చంద్రుడికా? బృహస్పతికా?'' అన్నాడు.

తార బ్రహ్మకేసి చూడలేక, తల వంచుకుని, ''చంద్రుడికే! చంద్రుడికే! చంద్రుడికే!'' అన్నది.

బ్రహ్మదేవుడు వెంటనే పిల్లవాణ్ణి చంద్రుడికి ఇప్పించి, తగువు తీర్చాడు. ఆ విధంగా చంద్రుడికీ, బృహస్పతి భార్య అయిన తారకూ బుధుడు పుట్టాడు. ఆ బుధుడికి పురూరవుడు పుట్టాడు. అది ఎలా జరిగిందంటే:

### పురూరవుడి కథ

ఒకప్పుడు సుద్యుమ్నుడనే గొప్ప రాజు ఉండేవాడు. ఒకసారి అతను కొంత మంది మంత్రులను వెంటబెట్టుకుని, గుర్రం మీద వేటకు బయలుదేరి, అమిత మనోహరమైన కుమారవనం చూసి, అందులో ప్రవేశించాడు. వెంటనే సుద్యుమ్నుడూ, అతని వెంట ఉన్న వారందరూ కూడా ఆడవాళ్లు అయిపోయారు. ఆఖరుకు సుద్యుమ్నుడి గుర్రం కూడా ఆడగుర్రంగా మారిపోయింది. ఇలా ఎందుకు జరిగినదీ సుద్యుమ్నుడు ఊహించలేక, ''ఈ రూపంతో ఎలా రాజ్యం చేస్తాను? భార్యలతో ఎలా కాపరం చేస్తాను? శత్రువులతో ఎలా పోరాడుతాను?'' అంటూ కుంగిపోయాడు.

ఇలా చెబుతున్న సూతుడితో శౌనకాది మునులు, ''అవునండీ? రాజూ, అతని

పరివారమూ స్త్రీలుగా మారటానికి కారణం ఏమిటి ?'' అని అడిగారు. సూతుడు ఇలా చెప్పుకుపోయాడు :

ఒకసారి సనకసనంధనాది మునులు శివుణ్ణి చూడటానికి కుమారవనానికి వెళ్ళే సరికి, అక్కడ పార్వతి దిగంబరంగా శివుడి వెంట వారికి కనిపించింది. వెంటనే వాళ్లు వెనక్కు తిరిగి నారాయణవనానికి వెళ్ళిపోయారు. అయితే పార్వతి జరిగిన దానికి చాలా సిగ్గుపడింది. ఆమె పడే బాధ చూసి శివుడు, ఆ వనంలోకి అడుగు పెట్టిన ప్రతి పురుషుడూ స్త్రీ అయేటట్టు నియమం పెట్టాడు. సుద్యుమ్నుడూ, అతని పరివారమూ స్త్రీలు కావటానికి అదే కారణం.

తరవాత అతను ఇళ అని పేరు మార్చుకుని తన చెలికత్తెలతో ఆ వనం లోనే ఉండిపోయాడు. చంద్రుడికొడుకైన బుధుడు ఈ ఇళను చూడటం తటస్థిం చింది. ఆ క్షణంలోనే ఇద్దరూ ఒకరి నొకరు ప్రేమించుకున్నారు. వారిద్దరికీ పుట్టిన వాడు పురూరవుడు.

తరవాత ఇళ తన కులగురువైన వసిష్ఠుణ్ణి తలచుకుంటే, ఆడ రూపంలో ఉన్న సుద్యుమ్నుడి మనోవేదన గ్రహించి, వసిష్ఠుడు శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు అనుగ్రహించి ప్రత్యక్షమయాడు.

''మా రాజైన సుద్యుమ్నుణ్ణి తిరిగి మగవాడయేలాగు వరం ఇయ్యి,'' అని వసిష్ఠుడు శివుణ్ణి వేడుకున్నాడు.





"నా మాట వ్యర్థం కారాదు. సుద్యు మ్నుడు ఒకనెల మగవాడుగానూ, ఒక నెల ఆడదిగానూ ఉండేటట్టు వరం ఇస్తాను," అన్నాడు శివుడు

ఇలా వసిష్ఠుడి దయవల్ల తిరిగి మగ వాడైన సుద్యుమ్నుడు తన రాజధానికి తిరిగివచ్చి, రాజ్యం ఏలసాగాడు. అతను మగవాడుగా ఉన్న నెల రాజ్యం చేసి, ఆడదిగా ఉన్న నెల అంతఃపురంలో నుంచి బయటికి వచ్చేవాడు కాడు. సుద్యుమ్నుడి యీ ప్రవర్తన ప్రజలకు ఏమీ బాగుండేది కాదు.

కొడుకు పెద్దవాడైన దాకా ఈ విధంగా రాజ్యం పాలించి తరవాత సుద్యుమ్నుడు తపస్సు చేసుకునేటందుకు వనానికి వెళ్ళాడు. అతను నారదుడి చేత నవాక్షరీ మంత్రం ఉపదేశం పొంది, ఆ మంత్రం జపిస్తూ తపస్సు చేసుకుంటూండగా, అతని సౌభాగ్యం కొద్దీ, ఒకనాడు మహాదేవి సింహం మీద ఎక్కి ఎదట ప్రత్యక్ష మయింది.

సుద్యుమ్నుడు పారవశ్యంతో ఆ దేవిని స్తోత్రం చేసి, ఆమె అనుగ్రహంతో ముక్తిపొందాడు.

సుద్యుమ్నుడి అనంతరం పురూరవుడు గొప్పగా రాజ్యం చేసి, ఎన్నో యజ్ఞాలూ, బ్రాహ్మణులకు దానాలూ చేశాడు. అతని అందమూ, కీర్తీ ఇతర గుణాలూ చూసి ఊర్వశి అతనిపై కన్నువేసింది. తరవాత ఆమె బ్రహ్మదేవుడి శాపంవల్ల భూమికి రావటం తటస్థించింది. అప్పుడామె పురూరవుణ్ణి కలుసుకుని, అతనితో కాపరం చెయ్యటానికి ఒప్పుకుని, "నాకు రెండు గొర్రెలున్నాయి. అవి నాకు బిడ్డలకన్న ఎక్కువ. నువ్వు వాటిని రక్షించాలి. తరవాత, నువ్వు నాకు దిగంబరుడుగా కనిపించరాదు. మరొకటేమంటే, నువ్వు నాకు తినటానికి తరచుగా నెయ్యి ఇయ్యాలి. ఈ నిబంధనలను నువ్వు ఉల్లంఘించినప్పుడు నేను నిన్ను విడిచి పోతాను," అన్నది.

అందుకు ఒప్పుకుని పురూరవుడు ఊర్వశిని చేరదీసి, ఆమెతో కొన్ని ఏళ్లు కాపరం చేశాడు. అతను పూర్తిగా కామంలో పడిపోయి, ధర్మార్థ మోక్షాల మాట తలపెట్టలేదు. ఊర్వశి కూడా పురూరవుడి ప్రేమలో మునిగి తేలుతూ, స్వర్గాన్నీ, దేవేంద్రుణ్ణీ పూర్తిగా మరచి పోయింది.

ఊర్వశీ పురూరవులు ఇలా ఉండటం చూసి, దేవేంద్రుడు ఊర్వశిని తిరిగి రప్పించుకోగోరి, గంధర్వులతో, "స్వర్గంలో రంభ మొదలైన అప్సరసలు ఎంతమంది ఉన్నా, ఊర్వశి లేక స్వర్గం కళాహీనంగా ఉన్నది. అందుచేత ఏదో విధంగా పురూరవుణ్ణి మోసగించి, గొర్రెలను అపహరిస్తే పని జరుగుతుంది. వెళ్ళి ఆ పని చెయ్యండి.'' అని, వారిని పంపాడు.

గంధర్వులు పురూరవుడికి తెలియకుండా ఒక చీకటి రాత్రి గొర్రెలను అపహరించారు. అవి అరవసాగాయి. అప్పుడు ఊర్వశి పురూరవుడితో, ''నేను కొడుకులకన్న ఎక్కువగా చూసుకునే గొర్రెలను దొంగలు ఎత్తుకుపోతూంటే, ఆడదానిలాగా చూస్తూ ఊరుకుంటావా? నువు రక్షిస్తావని నమ్మి నేను అశ్రద్ధ చేశానుగాని, నువు అసమర్థుడవని తెలియక మోసపోయాను,'' అంటూ అతన్ని నానామాటలూ అనసాగింది.

ప్రియురాలి మీద జాలిపడి పురూరవుడు, ఒంటిమీద బట్ట లేకుండానే





సాగాడు. అనుకోకుండా అతనికి ఊర్వశి కురుదేశంలో కనబడింది.

అప్పుడతను ఆమెను సమీపించి గద్గద కంఠంతో, "నీ మీద ఎన్నడూ ఆగ్రహించినవాణ్ణి కాను. కీడు చేసినవాణ్ణి కాను. ఎన్నడూ నీకు ఎదురు చెప్పలేదు. నీకు దాసుడిలాగా ఉంటూ వచ్చాను. నువు ఏ పని చెప్పినా చేశాను. నన్ను విడిచి వెళ్ళిపోయావు, ఇది న్యాయమేనా? నన్ను ప్రేమించి వచ్చావు. అలాటి దానివి నన్ను ఎందుకు విడిచి వెళ్ళినట్టు? నీ ప్రేమ శాశ్వతమనుకున్నాను. నన్ను ఇలా దుఃఖంలో ముంచుతావా?" అని వాపోయాడు.

దొంగల వెంటబడి తరిమాడు. పురూరవుడి ఒంటిమీద బట్టలేని మాట ఊర్వశికి తెలిసివచ్చేలాగ గంధర్వులు మెరుపులు మెరిపించారు. గొర్రెలను తెస్తున్న పురూరవుడు నగ్నంగా ఉండటం చూసి, ఊర్వశి అతని కాళ్ళకు మొక్కి, "నా నియమాలు ముందు చెప్పానుగదా! ప్రతిజ్ఞ ఉల్లంఘించిన నీతో ఇక కాపరం చెయ్యలేను. నేనిక వెళ్ళిపోవాలి. నన్ను మరచిపోకు," అని ఊరడించింది.

ఊర్వశి స్వర్గానికి తిరిగిపోగానే పురూరవుడు మనోవేదన పాలయాడు. అతనికి మతిపోయింది. అతను ఊర్వశినీ, ఆమె చేష్టలనూ తలచుకుంటూ తెగ తిరగ

అతని మనసు విరచటానికి ఊర్వశి, "మా జాతికి ప్రేమ ఏమిటి? నా కోసం బాధపడక, వెళ్లి నీ రాజ్యం చూసుకో," అంటూ వెళ్లిపోయింది.

పురూరవుడికి పట్టిన గతే తనకూ పట్టుతుందేమోనని వ్యాసుడు ఘృతాచిని చూసి అనుకున్నాడు. ఘృతాచి కూడా వ్యాసుడు తనను ఎక్కడ శపిస్తాడోనని, ఆడచిలుకగా మారి ఎగిరిపోయింది. అయితే వ్యాసుడు తీవ్రమైన విరహ బాధలో పడ్డాడు. దాని ఫలితంగా, వ్యాసుడు అగ్నికోసం మథించుతున్న అరణిలో నుంచి శుకుడు పుటాడు.

వ్యాసుడు శుకుణ్ణి చూసి, "ఏమిటీ అద్భుతం! ఇది శివుడి మహిమ కావాలి," అనుకున్నాడు. ఆయన తన కొడుకును గంగకు తీసుకుపోయి, స్నానం చేయించి, జాతకర్మ చేశాడు. ఆకాశంలో దేవ దుందుభులు మోగాయి. భూమి మీద పుష్పవర్షం కురిసింది. నారదుడు మొద లైన వారు పాడారు. రంభ మొదలైన అప్సరలు ఆడారు.

చిలుకరూపం ధరించిన స్త్రీ కారణంగా పుట్టినందుకు వ్యాసుడి కొడుక్కు శుకుడు అనే పేరు వచ్చింది. కుర్రవాడు క్రమంగా పెద్దవాడయాడు. శుకుడి కోసం ఆకాశం నుంచి జింకచర్మమూ, దండమూ, కమండలమూ పడ్డాయి. వ్యాసుడు తన కొడుక్కు ఉపనయనం చేసి, బృహస్పతి వద్ద వేదాభ్యాసం చేయించాడు.

శుకుడు తన విద్యాభ్యాసం ముగియ గానే గురుదక్షిణ ఇచ్చి, తండ్రి వద్దకు తిరిగి వచ్చాడు.

చదువు పూర్తిచేసి తిరిగి వచ్చిన కొడుకును కౌగలించుకుని, వ్యాసుడు ఎంతో సంతోషించి, అతనికి వివాహం చేతామనుకున్నాడు. ఆయన యోగ్యురా లైన ఒక మునికన్యను వెతికి తెచ్చి, శుకుడితో, "నాయనా, నువు వేద శాస్త్రా లన్నీ చదివావు. ఇక పెళ్ళి చేసుకుని, యజ్ఞయాగాలు చేస్తూ, పిల్లలను కనే సమయం వచ్చింది. కొడుకులు లేక పోతే గతులు ఉండవు. కీర్తి ఉండదు. అందుచేత ఒక కన్యను పెళ్ళాడి, పిల్లలను కని, నాకు సంతోషం కలిగించి, పితృ దేవతలకు తృప్తినియ్యి. నా మాట తీసి వెయ్యకు. ఎన్నో ఏళ్లు తపస్సు చేసిన కారణంగా నువు నాకు పుట్టావు. నీ మూలంగా కీర్తీ, సద్గతి కలగాలని ఆశిస్తున్నాను," అన్నాడు.

ఆ మాటకు శుకుడు తండ్రితో, "నాకు పెళ్లివద్దు. తత్త్వం ఉపదేశించు. చూస్తూ, చూస్తూ నన్ను సంసార సాగరంలోకి ఎందుకు తోస్తావు?" అన్నాడు.





# మాయమత్స్యకన్య

బ్రిటిషువారి కాలంలో ఒక సంస్థానానికి రాజుగా ఉండిన రామప్రతాపుడు విచిత్రమైన వ్యక్తి. ఆయనకు మూఢ నమ్మకాలతోబాటు మంకుపట్టు కూడా ఉండేది. అతని మెదడులోకి ఏదన్నా ఆలోచన వస్తే, అది ఎంతో హాని చేసిగాని వదిలేది కాదు. ఇందువల్ల ఆయన సలహాదార్లూ, సంస్థానంలోని ప్రజలూ కష్టాలకు గురి అయేవాళ్ళు.

ఒకసారి ఆయన వంగదేశం సందర్శించి, అక్కడ జనపనార పంట విరివిగా ఉండటం చూసి వచ్చి, తన దేశంలో రైతులందరినీ అదే పంట వెయ్యమని ఒత్తిడి చేశాడు. విధిలేక రైతులు ఆ పంట వేశారు. దాని ఫలితంగా నాసిరకం జనపనార ఉత్పత్తి అయి, నష్టానికి అమ్ముకోవలసి వచ్చింది. ఆహార ధాన్యాలు పండవలసిన పొలాలలో జనపనార వెయ్యటం వల్ల దేశంలో తిండి కరువు ఏర్పడి, ప్రజలు దుర్భరమైన కష్టాలకు గురిఅయారు.

మరొకసారి రామప్రతాపుడు, కాకులూ, మాలకాకులూ, యమదూతలనీ, దేశంలో అవి ఉండటం దేశానికి అరిష్టమనీ, అందుచేత దేశంలో ఎలాటి కాకీ లేకుండా చెయ్యాలనీ తీర్మానించుకుని, జనాన్ని కాకులను చంపమని హెచ్చరిస్తూ, చచ్చిన కాకికి ఇంత అని బహుమానం ఇస్తానన్నాడు. ప్రజలు కాకులను చంపి తెచ్చి రాజధానిలో గుట్టలుగా పోసి డబ్బు పుచ్చుకున్నారు. ఆ కాకుల కళేబరాలను ఏం చెయ్యాలో తోచలేదు. వాటినుంచి దుర్గంధం బయలుదేరి, రాజధాని పౌరులకు బతుకు దుర్భరమయింది. ఇంతేగాక, కాకులు పాకీపని అద్భుతంగా చెయ్యగలవు. ఇప్పుడు దేశంలో కాకులు

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

లేని కారణంగా ఎక్కడి కుళ్ళు అక్కడే దిగబడి, రోగాలు వ్యాప్తి చెందాయి. జరిగిన పొరపాటు తెలుసుకుని రామ ప్రతాపుడు, పొరుగు దేశాల నుంచి కాకులను తెచ్చినవారికి బహుమానాలు ప్రకటించాడు. అలాంటివాడు రామ ప్రతాపుడు!

ఇలా ఎన్నిసార్లు అభాసు జరిగినా అతని వైఖరి మటుకు మారలేదు. ఒకసారి రామప్రతాపుడు తన మంత్రితో, "మత్స్య కన్యల గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు.

"దేవా, నేను అలాటి ప్రాణిని చూడక పోవటం చేత ఏమీ చెప్పలేను," అన్నాడు మంత్రి వినయంగా.

"కిందటి రాత్రి నాకు కలలో కనిపించింది—పై భాగం మనిషి, కింది భాగం చేప! ఇది చాలా చిత్రంకాదూ?" అన్నాడు రాజు.

రామప్రతాపుడి రాజభవనం ముందు పెద్ద కొలను ఉండేది. ఆ కొలనులోని నీరే నగరానికంతకూ ఉపయోగపడేది. అందులో చేపలు కూడా ఉండేవి. వెన్నెల రాత్రులప్పుడు రామప్రతాపుడు చిన్న డింగీలో ఆ కొలనులో విహరించేవాడు. మంత్రితో మత్స్యకన్య గురించి మాట్లాడిన రాత్రి మంచి వెన్నెల రాత్రి. ఆ రాత్రి రామప్రతాపుడు డింగీలో ఒంటరిగా కొలనులో నౌకా విహారానికి బయలు దేరాడు. అయితే ఆయన అంతలోనే



తిరిగి వచ్చి, వెంటనే రమ్మని మంత్రికి కబురు పంపాడు.

మంత్రి వచ్చాడు. రాజు అతనితో, ''మన కొలనులో ఇంతకుముందే మత్స్య కన్యను చూశాను. అది నా డింగీ ముందు గాలిలోకి ఎగిరి, నీటిలో పడింది. నేను స్పష్టంగా చూశాను—సగం మనిషి, సగం చేపా! నాకు అది కావాలిప్పుడు. అది తప్పించుకుపోకుండా కొలను చుట్టూ కాపలా ఏర్పాటు చేసి, దాన్ని పట్టుకునే ఏర్పాట్లు చేయించండి,'' అన్నాడు.

''అది భ్రమ కావచ్చు, మహారాజా. ఒక పెద్ద చేపను చూసి మీరు మత్స్య కన్య అనుకున్నారేమో! అస్పష్టమైన చంద్రకాంతి గద!'' అన్నాడు మంత్రి.

''నా కేమీ చత్వారం లేదు. వెంటనే నేను చెప్పినట్టు చేయించండి,'' అన్నాడు రాజు.

మత్స్యశాఖ మనుషులు వచ్చి కొలను యావత్తూ గాలించి వదిలిపెట్టారు. వేల కొద్దీ చేపలు పడ్డాయిగాని, మత్స్యకన్య జాడలేదు.

''కొలనులో నీరంతా తోడేయించి, కొలనును ఎండగట్టించండి,'' అన్నాడు రాజు. అలా చేస్తే నగరమంతా జల మయమైపోతుందనీ, దానితోబాటు తాగ టానికి చుక్క నీరైనా లేక ప్రజలు అల్లాడి పోతారనీ మంత్రి చెప్పి చూశాడు. కాని రాజు వినిపించుకునే రకం కాదు, తనకు ఆ మత్స్యకన్య కావాలన్నాడు.





"చిత్తం, కొలనులో నీరు తోడించే ఏర్పాట్లు రెండు, మూడు రోజులు పట్టవచ్చు. కాకపోయినా కొలనులో చిన్న చేపపిల్ల కూడా లేకుండా గాలించాం. మత్స్యకన్య ఉండే అవకాశం లేదు. ఈ రెండు మూడు రోజులూ ఆలోచించి చూడండి, మహారాజా. మీకు దృగ్భ్రమ లాంటిది కలిగి ఉండవచ్చు," అన్నాడు మంత్రి.

రాజు మంత్రి మీద విసుక్కున్నాడు. మంత్రి ఇంటికి తిరిగి వచ్చి, తన అన్న కొడుకు, హలధరుడనే ఐంద్రజాలికుడు పొరుగుదేశం నుంచి వచ్చి ఉండటం చూశాడు. మంత్రి విచారంగా ఉండటం చూసి, హలధరుడు కారణం అడిగి, కథ అంతా తెలుసుకుని, "మీ రాజుగారికి దృగ్భ్రమలు కలగవూ? కలుగుతాయని నిరూపించటానికి నేనొక యంత్రం తయారు చేస్తాను, నువు వెళ్లి విశ్రాంతి తీసుకో," అన్నాడు.

మంత్రి అవతలి గదికి వెళ్ళగానే, హలధరుడు మూడు అంగుళాల నిడివీ, అంగుళం వెడల్పు గల కాగితం తీసుకుని మధ్యకు మడిచి, మడత ఉన్న భాగాన్ని ఒక గాజు లోటా అడుగు భాగంలో అంటించాడు. ఒక చిన్న పింగాణీ పళ్లెం మధ్య ఒక అర్ధరూపాయి నాణెం, బొమ్మ పైకి ఉండేటట్టు పెట్టి, కొద్దిగా నీరు పోశాడు. ఆ తరవాత గాజు లోటా అడుగున ఉన్న కాగితానికి మంట పెట్టి, లోటా నిండా దట్టమైన పొగ నిండేలాగు చేసి, దాన్ని పింగాణీ పళ్ళెం మీద బోర్లించాడు. ఇప్పుడు లోటా అంచుకుండా అర్ధరూపాయి నాణెం కేసి చూస్తే, అది పెద్దది అయినట్టు కనిపించింది.

హలధరుడు మంత్రిని పిలిచి, "పెదనాన్నా, జాగ్రత్తగా చూసి, చెప్పు. పళ్లెంలో ఎన్ని రూపాయలున్నాయి?" అని అడిగాడు.

మంత్రి పరీక్షగా చూసి. "ఒక్క రూపాయే గదరా?" అన్నాడు.

"ఒక్క రూపాయే ఉన్నదనీ, ఎక్కువ లేవనీ రూఢిగా చెప్పగలవా?" అని హలధరుడు మళ్ళీ అడిగాడు.

"ఆహా!" అన్నాడు మంత్రి.

"నువు భ్రమపడ్డావు. అది రూపాయి కాదు. చూడు!" అంటూ గాజు లోటా ఎత్తి, పళ్లెంలోని నీటి నుంచి అర్ధరూపాయి బిళ్ళ బయటికి తీసి చూపాడు హలధరుడు. కన్ను భ్రమపడిందనటానికి ఎలాటి సందేహమూ లేదు.

ఆ భ్రమ కలిగించే మార్గం హలధరుడి దగ్గిర తెలుసుకుని, మంత్రి ఆ యంత్రాన్ని అలాగే తీసుకుపోయి రాజు ముందు పెట్టి, "మహారాజా, ఇందులో మీకు ఎన్ని రూపాయలు కనబడుతున్నాయి?" అని అడిగాడు.

"ఒక్క రూపాయే ఉన్నది. నాకు ఏదైనా దృష్టిలోపం అనుకున్నారా?" అన్నాడు రాజు.

"క్షమించండి, మహారాజా! మా వాడు నన్ను ఇలాగే అడిగితే మీరు చెప్పినట్టే చెప్పాను. నా కళ్ళు భ్రమపడ్డాయని మా వాడు అన్నాడు. మీ దృష్టి నా కన్న నిశితమైనది కదా, మీకు దృగ్భ్రమ అనేది ఉండదు గదా అని మిమ్మల్ని అడిగాను. లోటా కింద నిజంగా ఏమున్నదో చూస్తామా?" అన్నాడు మంత్రి.

రాజు చప్పున లోటా పైకి తీశాడు. పింగాణీ పళ్లెంలో అర్ధరూపాయి మాత్రమే ఉన్నది.

రాజు నిర్ఘాంతపోయి, "నాకూ కన్ను భ్రమిస్తుందన్నమాట! ఒకవేళ నేను చూసిన మత్స్యకన్య భ్రమే అయి ఉంటుందా?" అన్నాడు తనలో తాను మాట్లాడుకుంటున్నట్టుగా.

"ఎందుకు కాగూడదు, మహారాజా? ఆ క్రితం రాత్రే మీరు కలలో మత్స్యకన్యను చూశామన్నారు గద? కొలను ఖాళీ చెయ్యనవసరం లేదేమో! ఏమంటారు?" అన్నాడు మంత్రి.

రాజు తల అడ్డంగా తిప్పాడు. మంత్రి ప్రాణం కుదుటపడింది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1979 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.



Prabhakar Mahadik

★



Devidas Kasbekar

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ డిసెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ముక్కుల ముచ్చట

రెండవ ఫోటో : మూగముచ్చట

పంపినవారు: ఆర్. ప్రకాష్. ఉన్నత పాఠశాల, నేమకల్లు. (కర్నూలు జిల్లా)

**బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.**

**Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

# జెమ్స్‌తో బలే మజా

## అదృష్టవంతులు గెలుపొందేందుకు 1001 బహుమతులు

ఇక్కడ లేని అంకె ఏమిటో చెప్పుకోండి చూద్దాం?







మీ జవాబు, మీ పేరు, మీ చిరునామా కూడా ఇంగ్లీషులోనే విడి అక్షరాలలో వ్రాయండి. మీ ఎంట్రీలను ఈ క్రింది చిరునామాకు పంపండి.

"Fun with Gems"
Dept. E-14
Post Box No. 56,
Thane 400 601
Maharashtra.

ఎంట్రీలు గ్రహించబడేందుకు ఆఖరు తేది:
12.1.1979

## త్వరపడండి!

మీ జవాబుతోపాటు క్యాడ్‌బరిస్ జెమ్స్‌యొక్క ఖాళీ ప్లాస్టిక్ ప్యాకెట్ పెద్దది (30 గ్రాములది) ఒకటి జతపరచి పంపండి. సరియైన జవాబు పంపిన మొదటి 1001 మంది విజేతలకు రూ. 11 విలువగల స్టేట్ బ్యాంక్ కానుక చెక్‌లు లభిస్తాయి.

**చాక్లెట్ మధ్యలోగలిగిన రంగురంగుల క్యాడ్‌బరిస్ జెమ్స్**

CHAITRA-C-193 TEL

# చిగుళ్ల బాధకు తొలి చిహ్నాలు



పాచి : (Plaque)
[illegible]

[illegible]

[illegible]

దంతవైద్యులు చెబుతున్నారు :

## చిగుళ్ల బాధలు, దంతక్షయం అరికట్టడానికి నియమానుసారంగా పళ్లను బ్రష్ చేసుకొని చిగుళ్లను మాలిష్ చేసుకోవాలి.

సరియైన దంత సంరక్షణ కోసం, రోజూ రాత్రి, ప్రొద్దున్న ఫోర్‌హాన్స్‌తో మీ పళ్లను సరిగ్గా తోముకొని చిగుళ్లను మాలిష్ చేసుకోండి. ఫోర్‌హాన్స్ డబుల్-యాక్షన్ టూత్ బ్రష్ కావాలని అడగండి. ఇది పళ్లను శుభ్రపరచి, చిగుళ్లను మాలిష్ చేసేందుకు ప్రత్యేకంగా రూపొందించబడింది.




చిగుళ్ల బాధల్లు అనారోగ్యానికి దారితీస్తాయి



ఉచితం! [illegible] P-179-180 [illegible]

ఫోర్‌హాన్స్

దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్‌పేస్టు

180 F-172 R TL

